# కోతలరాయుడు

- సుంకర సత్యనారాయణ -

1-50

SANKAR SANJIVI



# కోతల రాయుడు

(నాటకం)

రచన:

సుంకర సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పరిచయం

మాభూమి, ముందడుగు, భూమికోసం, వీరకుంకుమ, గిత్తలబేరం మొదలైన నాటకాలు, నాటికలవల్ల ఆంధ్ర మహా జనులకు సుపరిచితులయిన శ్రీ సుంకర సత్యనారాయణగారు రచించిన 'కోతల రాయుడు' నాటకాన్ని ప్రచురించి అంది స్తున్నాము.

ఆంధ్రప్రజలు, నటీనటులు పైన పేర్కొనిన వీరి నాటికలను, నాటకాలను ఆదరించినట్లే యీ నాటకాన్నికూడా ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

—ప్రచురణకర్తలు.





కీ. శే. వాసిరెడ్డి భాస్కరరావు

# అంకితం

మిత్రుడు - వాసిరెడ్డికి

ఎందు బోతివో ఎవరి నుంచివో
తెలియ డాలను తలచి నంతనె
గ్రాలు మందువు వనుల మునుపటి
తిలతిలగ మిత్రమా!

పుట్టితిమి యిరువురుగ, జగతిని
మసలుకొంటిమి మనను లోకకై
కన్నుగుట్టి అకాలమృత్యువు
నిన్ను మ్రింగెను భాస్కరా.

కలిసి వ్రాసిన వ్రాయకున్నా
నీవు లేనిది నేను లేనోయ్
ధర్మసూత్రము కర్మక్షేత్రము
గమ్యం మొకటేగా!

నే నడెట్లిక నిన్ను చూచుట
అందుకొని జోహార్లు యీ కృతి
కన్యా ద్వారా, కరుణ నన్నా
శీర్వదించుము మిత్రమా.

— సుంకర.

# పాత్రలు

| పాత్రలు | పరిచయం | వయసు |
|---|---|---|
| మాధవరావు | కథానాయకుడు | 30 సం॥ |
| శేఖర్ | అతని తమ్ముడు | 22 |
| కామయ్య | వాళ్ళ తండ్రి | 55 |
| భూషయ్య | రైతు | 40 |
| శంకరయ్య | రైతు | 35 |
| మురళి | శేఖర్ స్నేహితుడు | 24 |
| రత్తయ్య | మాధవరావుగారి బంధువు | 45 |
| కేశవరావు | ధనికుడు | 35 |
| సుబ్బన్న | కేశవరావుగారి నౌకరు | 60 |
| వెంకయ్య | పొరుగూరి పెద్దమనిషి | 50 |
| బాబు | శంకరయ్య కొడుకు | 12 |
| అరుణ | కథానాయకి | 25 |
| ఇందిర | కేశవరావు చెల్లెలు | 18 |



# ఒకటో రంగం

[కామయ్యగారి యిల్లు. హాల్లో ఒక టేబులు, మూడు కుర్చీలు, బెంచీ ఉంటాయి. గోడలకు గాంధీ, నెహ్రూ, రామమోహనరాయ్, గురజాడ, వీరేశలింగం... మొదలైన జాతీయ నాయకుల...సంస్కర్తల ఫొటోలు: టేబిల్ మీద పేపర్ వెయిట్...కొన్ని కాగితాలు...నాలుగైదు పుస్తకాలున్నా:

మాధవరావు కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఖద్దరు లాల్చీ ధోవతీ ధరించాడు. మడత విప్పని ఉత్తరీయం, కుర్చీమీద వేసివుంది.]

మాధవరావు: (వ్రాయడం ఆపి, లోనికి చూస్తూ) అరుణా! అరుణా!

అరుణ: [లోపలినుంచి] ఆఁ...

మాధవ: ఏమిటే ఆలస్యం?

అరుణ: అయింది, వస్తున్నా...

మాధవ: ఏం వస్తున్నా, ప్రాణం తీస్తున్నావ్! అరగంట యింది – మీటింగుకి వెళ్ళాలని చెప్పి! అరటావు నోట్సు వ్రాసుకున్నాను; అయినా నీ డ్రస్ వేసుకోవడం పూర్తి కాలేదు. ఎంతసేపు యీ మేకప్?

[అరుణ వచ్చింది. 25 సంవత్సరములు. జుట్టు ముడి, తలలో పువ్వులు, తెల్లచీర, జాకెట్టు, కుంకుమబొట్టు, చేతిలో కప్పూ-సాసరూ ఉన్నాయి.]

అరుణ: (నవ్వుతూ) కాదు; కప్పు కాఫీ.

మాధవ: (కాఫీ అందుకుంటూ) ఇంకా బట్టలే మార్చుకోలేదే! ఎప్పుడూ నీవిక మీటింగుకి బయలుదేరేది? (చేతిగడియారం చూపుతూ) చూడు టైం అయ్యింది!

అరుణ: అందుకే తొందరగా వెళ్ళి రమ్మంటూన్నాను.

మాధవ: అయ్యిందీ?... నేను వెళ్ళిరా లేక నేనా నిన్నుకూడ రమ్మంది?! బాగుందోయి; బాగుంది!

అరుణ: మీ నాన్నగారి సంగతి తెలుసుగా? ...ఎందుకు అనవసరంగా వారికి బాధ కలిగించటం? మీరు వెళ్ళి రండి.

మాధవ: ఆయనవన్నీ బి. సి. నాటి అభిప్రాయాలు. ఇది యిరవయ్యో శతాబ్దం! తొందరగా వెళ్ళి, డ్రస్సు మార్చుకురా!

అరుణ: ఎందుకు లెండి....

మాధవ: ఇన్నల్లు! ఎంత చెప్పినా నీ మతం నీదేనా? అభ్యుదయ భావాలు గల స్త్రీని వివాహమాడాలని ప్రయత్నించాను. మా నాన్న ఎన్ని సంబంధాలు తెచ్చినా తిరస్కరించాను, నీ వేదో చదువుకున్నదానివీ ... తెలివి గలదానివీ...అని తెలిసి, స్వీకరించాను. నీ తెలివి యిలా వుంది!

అరుణ : ఎందుకూ విసుక్కుంటారు ? ఇప్పుడు నేను మీకు చేసిన లోపమేమిటీ ?

మాధవ : ఇంకేం చెయ్యాలి ? ! ఫలానా మాధవరావుగారు ఉపన్యసిస్తారు, స్త్రీలూ...పురుషులూ...అంతా తప్పక మీటింగుకి రావాలని అవతల చాటింపు వేయించాను.

అరుణ : వేయించారనుకోండి. మీ నాన్నగారికి పెద్దతనం; ఆయనకు, వేళకు అన్నీ చూడాలా ? శేఖర్ కాలేజీకి వెళతాడు; ఆ అబ్బాయినీ సరైన టైంకు పంపించాలా ? నేనూ మీతో పాటు సభలకీ...సమావేశాలకీ తయారైతే, ఇవన్నీ ఎవరు చూస్తారు మరి ?...మీరే చెప్పండి.

మాధవ : అర్థంలేదు : (లేచి, పచార్లుచేస్తూ) మగువ మాంచాల, మల్లమదేవి, మహారాణి రుద్రమ మొదలైన వీర వనితలు పుట్టిన తెలుగు గడ్డపై పుట్టి, నీవిలా మాట్లాడటం... నీకేగాదు; స్త్రీజాతికే అవమానం ! దేశం సంగతి అలావుంచు. కనీసం...నీ భర్త గౌరవం కాపాడాలన్నా, ఇవ్వాళ నీవు మీటింగుకి తప్పక వచ్చి తీరాలి !

అరుణ : ఎందుకండీ ! మీటింగు దగ్గర మీరు మైక్‌లో మాట్లాడుతుంటే...ఇక్కడికి హాయిగా వినపడుతుంది ! ఉపన్యాసం వినటమేగా మీకు కావలసింది ?

మాధవ : అదికాదు; నువ్వు మీటింగుకి రాకపోతే నాకెంత అగౌరవమో తెలుసా ? ప్రతివాడూ ఎత్తి పొడిచేవాడే; ఎగతాళి చేసేవాడే !

అరుణ : ఎందుకూ ?

మాధవ : ఎందుకా ?...నిన్ను మీటింగుకి తీసుకెళ్ళకుండా, ఊళ్లో స్త్రీలు సందరినీ మీటింగుకి తీసుకురావాలని ఉపన్యాసం దంచినందుకు !

అరుణ : ఎవరి యిబ్బంది వాళ్లేం టివో ! తొందరపడి మీరు అలా ఎందుకు చెప్పాలి ?

మాధవ : ఈ మాత్రం తెలియక ! సమాజంలో సగానికి పైన ఆడజనం ! అందరూ నీలాగే చేతులు ముడుచు కూచున్నారనుకో; అప్పుడు బాగుపడమంటే దేశం ఎం బాగుపడుతుంది ? (విసుగ్గా) ఎప్పుడూ...ఇల్లూ; ఇల్లు ! కాసేపు మీటింగుకి రావడానికి యింటిపను లడ్డమట; యింటిపనులు !

అరుణ : ఏమిటో...మీదంతా ఒగ్గొడవ !

మాధవ : ఆల్ రైట్, తొందరగా బయలుదేరు. ఊఁ !

అరుణ : (ఇష్టం లేకపోయినా) సరే.

[అరుణ లోనికి వెళ్ళింది. భూమయ్య వచ్చాడు. భూమయ్య రైతు. 40 సంవత్సరాలుంటాయి. నీరుకావి పంచలు; బనియను; మీసం; చెప్పులు; చేతిలో ములుకోల కర్ర.]

భూమయ్య : (వస్తూనే) ఎక్కడికి బయలుదేరేది ?

మాధవ : రా భూమయ్యన్నా; రా...రా.

భూమయ్య : రావటం పోవటంగానే వుంది నా బతుకంతా ! ఇంకెంతకాలం నానబెడతావ్ బాబూ ఆ పంచాయితీ ? ఇయ్యాలన్నా ఏదో ఒకమోక్షముందా దానికి ?

మాధవ : పెద్దవాడివి - నీవుకూడా ఇట్లా మాటాడితే ఎట్లా భూమయ్యన్నా ? పంచాయితీ - అంటే మాటలా ! ఎన్ని చిక్కులు ! ?... ఉభయులకీ నష్టం...కష్టం లేకుండా చూడాలి. అందులో నీ తగాదా కేశవరావుగారితో !

భూమయ్య : అవున్లే; ఆయన కలిగినాడు గదూ...!

మాధవ : ఏం అయితే ! ఇద్దరూ నాకొకావలసినవాళ్ళే !

భూమయ్య : ఉండ నాయం సెప్పడానికి, అయినాళ్ళేంటి... కానాళ్ళేంటి ?

మాధవ : ఇదిగో...భూమయ్యన్నా ! ఒక తీర్పు చెప్పాలంటే, రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ఎన్ని విషయాలు ఆలోచించాలో తెలుసునా ?

భూమయ్య: అయ్యన్నీ తెలిస్తే నీ సుట్టూ ఎందుకు తిరగాలి ? నా యేడుపేదో నేనే యేడుసుకునే వాణ్ణిగా ?

మాధవ : అదేం మాట ! కాస్త ఓపిక పట్టాలిగానీ...

భూమయ్య : ఓపిక ! ఎన్నాళ్లనీ ? ఇయ్యాలా, నిన్నా ! ఎంత కాలమైందో నువ్వే చెప్పు; నే మిద్దరం నువ్వు చెప్పినట్టు యింటామని రాసిచ్చి !

మాధవ : ఇవ్వాళ నా ఉపన్యాసంలో నీ విషయమేగాదు; ఇట్లాంటి సమస్యలన్నీ తేల్చివేస్తాను !

భూమయ్య : అందులో తేలి చచ్చేదేముందీ ? అనె రోజూ వుండే తోముడేగా ?

మాధవ : అట్లాగాదు. ఇవ్వాళ నా ఉపన్యాసం వింటే, నీకే తెలుస్తుంది! హృదయాలు ద్రవించాలి! రాళ్లు కరిగి పోవాలి!!...నీ కెందుకూ; నీవు పద - మీటింగుకి!

భూషయ్య : ఏం మీటింగో...ఏం కరగటమో! తొందరగా తెల్పు బాబు; నీ పుణ్యం వుంటుంది.

(వెళ్లాడు)

మాధవ : ఆల్ రైట్. అరుణా! అరుణా!

[మాధవరావు తండ్రి - కామయ్య వచ్చాడు. వయసు - 55 సంవత్స రాలు; నెరిసీ నెరియని జుట్టు; మీసం; నీరుకావి పంచెలు.]

కామయ్య : (వస్తూ) ఎందుకురా ?

మాధవ : మీటింగుకు నాన్నా.

కామయ్య : మీటింగులు పెట్టి, నువ్వు ఉద్ధరిస్తున్నావుగా! చాలదూ ? ఇంకా ఆవిడ కూడా ఎందుకూ ?

మాధవ : ఏం ? తీసుకెళితే తప్పేముంది నాన్నా ?

కామయ్య : అబ్బే...ఏముందీ ? తీసుకెళ్లి, పెళ్లాం చేతగూడా ఉపన్యాసాలిప్పించు ! సరిపోతంది. వింటే ఎనడన్నా నవ్వు తాడనికూడా సిగ్గులేదేంరా ?

మాధవ : ఇందులో సిగ్గుపడాల్సిన విషయమేముంది నాన్నా ?

కామయ్య : కాకపోతే ఏమిటిది ? మన వంశంలో ఆడది ఎప్పుడైనా గడపదాటి ఎరుగునంట్రా ?

మాధవ : ఆ కాలం వేరు; ఈ కాలం వేరు. ఆ రోజుల్లో సభలకీ - సమావేశాలకీ వెళ్ళడం తప్పైతే, యిప్పుడు

వెళ్ళకపోవడం తప్పా! కాలానుగుణ్యంగా మనం. మన అభిప్రాయాల్నీ...ఆచారాల్నీ మార్చుకోవాలి. లేకపోతే పైకి రాలేం; రాం కూడా!

కామయ్య: (వ్యంగ్యంగా) ఆఁ! పైకొచ్చేకళ కనపడతానే వుంది!

మాధవ: నిజమే; ఇదంతా మీవంటివారికి వింతగానే కనపడుతుంది. మీరు ఓపిగ్గా అర్థం చేసుకుంటే...

కామయ్య: సరే! ఈ సొదంతా నాకెందుకూ? తీసుకెళ్లు. నీకిప్పుడు తెలిసిరాదులే - నెత్తిమీది కొచ్చినాకగానీ...!

[లోనికి బయలుదేరాడు. అరుణ ఎదురైంది. ఆమెను ఎగా-దిగా జూచి...]

కామయ్య: ఇదుగో...అమ్మాయ్! ఇంట్లో సరే; బయట కెళ్ళేటప్పుడు కూడా బోసిమెడతోనే వెళ్ళాలా?

అరుణ: ఈ కాస్తదానికీ...నగలెందుకులెండీ.

మాధవ: (అరుణతో) అదికాదు; పెద్దవారిమాట కాదన కూడదు. చెప్పినట్లుచేయ్. వెళ్లు.

[అరుణ లోనికి వెళ్లింది]

కామయ్య: (వ్యంగ్యంగా) ఇదీ కొంతనయమే!

[రత్తయ్య వచ్చాడు. వయసు 45 సంవత్సరాలు. తెల్లపంచలు; హాఫ్‌షర్టు; తుండు; కాళ్లకు ఆకు చెప్పులు.]

రత్తయ్య: (వస్తూనే) ఏం కామయ బావా...

కామయ్య: ఎవరూ?...నువ్వా?!! రత్తయ్య బావా - రా; రా!

మాధవ : రామ మందిరం దగ్గర మీటింగయితే...నీ వీటొచ్చేశావేవిఁటి మాఁవా ?

రత్తయ్య : ఆఁ...! మీటింగులూ...బోటింగులూ పనీ - పాటాలేని మీబోటివాళ్లగ్గానీ...నా కెందుకబ్బాయ్ !

మాధవ : మీటింగంటే మీకు అర్థంగానట్లుంది. మన గ్రామాన్నీ......దేశాన్నీ......ఎట్లా వృద్ధిలోకి తీసుకు రావాలో - నలుగురూ ఒకచోట కూర్చుని ఆలోచించడమే, మీటింగు !

రత్తయ్య : మనల్ని మనం ఉద్ధరించుకుంటే...ఊరిని ఉద్ధరించినంత పుణ్యాం !

కామయ్య : బాగా చెప్పావ్.

ఒక గొంతు : (తెరవెనుక - లౌడ్‌స్పీకర్ లోనుండి) సోదరులారా ! మన గ్రామోద్ధరణ సంఘ కార్యదర్శిగారైన శ్రీ మాధవ రావుగారు, రావడం ఎందువల్లనో ఆలస్యం అయింది. ఇప్పటికి వారు వస్తూనేవుండాలి. మీరంతా నిశ్శబ్దంగా ఉండాలని నా ప్రార్థన.

మాధవ : (పై మాటలు విని) అరుణా ! అరుణా !

అరుణ : (లోపల నుండి) ఆఁ...వస్తూన్నానండీ...

(వచ్చింది)

రత్తయ్య : అమ్మా యెక్కడికి ?

మాధవ : మీటింగుకి !

రత్తయ్య : (ఆశ్చర్యంగా) ఏంటీ ??..........అమ్మాయూ - మీటింగుకి ?

మాధవ: అత్తయ్యని కూడా తీసుకువెళతాం మావయ్యా!

రత్తయ్య: (కలవరపడి) ఆఁ ఆఁ... మీరెళ్లండి బాబు. దానికి ఒంట్లో బాగా లేదు.

[మాధవరావూ, అరుణా నవ్వుతూ బయటికి వెళ్ళారు.]

రత్తయ్య: ఈ మీటింగులేంటీ... ఈ పోవటం ఏంటీ... నువ్వు చూస్తా ఊరుకోడం ఏంటీ...? ఏంటి కామయ్య బావా...

కామయ్య: ఊరుకోక ఏంజెయ్యమంటావ్?!... ఉరిపెట్టుకో మంటావా?

రత్తయ్య: అదేంటి బావా... నువుకూడా అట్లా అంటావ్! చచ్చి ఏలోకాన ఉందో మా అక్కయ్య, పుణ్యాత్మురాలు! ఊళ్ళో... జనం, ఆమె పెళ్ళినాడు చూశారు. మళ్ళీ మొన్నపోయినాడు చూశారు; అంతే...

కామయ్య: వాళ్ళు వేరు; ఆ కాలం వేరు! అయినా... వాడి పెళ్ళాన్ని వాడు మీటింగుకి తీసుకెళతన్నాడు. మనం వద్దనటం ఎందుకూ? ఎవడి పిచ్చి వాడి కానందం. ఏమంటావ్?

ఒకగొంతు: (లోపల - మైక్‌లో) సోదర సోదరీమణులారా! మీటింగు ప్రారంభించేముందు, శ్రీమతి అరుణాదేవిగార్ని ఒక పాట పాడవలసిందిగా కోరుతున్నాం.

రత్తయ్య: ఇన్నావటయ్యా... కామయ్య బావా? పాట పాడతందట! పాట!

కామయ్య: (నిట్టూర్పు విడుస్తూ) ఊఁ...

[రత్తయ్య, కామయ్యవంక అదో విధంగా చూస్తాడు.]

ఒక గొంతు : ఏమిటీ?...పాడ లేనంటూన్నారా? తప్పదు! ప్రజల కోరిక మన్నించి తీరాలి!

రత్తయ్య : (చీదరింపుగా) ఎవడశ నువ్వు!! ప్రజల కోరికంట! కోరిక!

[మైక్‌లో అరుణ పాట ప్రారంభించింది. మొదట గొంతు కాస్త తడబడి వణుకుతుంది. తర్వాత శ్రావ్యంగా వుంటుంది.]

పాట :

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయి
గట్టి మేల్ తలపెట్టవోయి....

ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి
జల్దుకొని కళ లెల్ల నేర్చుకు
దేశి సరకులు నించవోయి....

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయి...

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి...

స్వంత లాభం కొంత మానుకు
పొరుగువారికి తోడుపడవోయి
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయ్...

[పాట అంతరగం, కరతాళ ధ్వనులు మిన్నుముట్టుతాయి.]

కామయ్య: ఎప్పుడూ వినలేదయ్యా. మొత్తానికి... మా కోడలు బాగానే పాడతంది!

రత్తయ్య: కోడలు పాటకే మెచ్చావే! ఇక కొడుకు ఉపన్యాసం విను.

కామయ్య: ఆఁ... వాడి మొఖం.

రత్తయ్య: ఇదిగో, ఈ మైకులంటూ వచ్చినై. ఇష్టం వుండా లేకపోయినా యినాల్సిందే!

కామయ్య: మీటింగుల కింకా నయం. మొన్న రామయ్య గారింటో పెళ్లి జరిగింది చూడు; తెల్లవార్లూ ఒకటే రొద. కన్ను మూసినపాపాన పోలేదనుకో!

రత్తయ్య: ఆఁ... పెళ్లంటే జ్ఞాపక మొచ్చింది, ఈ యేడు చిన్నకొడుకు పెళ్ళి చెయ్యవ్?

కామయ్య: చదువు పూర్తయ్యేదాకా చేసుకోనంటున్నాడు మరి?

రత్తయ్య: చదువు ఈ యేడూ పూర్తిగాదా యేంటి?

కామయ్య: వానికి మితమెక్కడిదీ? వాడి కింకా చదువు కోవాలనే ఉంది.

రత్తయ్య: ఓ యబ్బో......ఇంకెందుకూ? చదివినమట్టుకు చాలు. బతికినంతకాలం చదువే అయితే, యిక సంపాదన ఎప్పుడూ?!

కామయ్య: అది సరేలే. వాడు చదువుతానన్నా మనకు చదివించే ఓపిక ఉండొద్దూ?

రత్తయ్య: కాదు మరీ; ఈ చదువుకోసం రోజూ బస్తీకి పోనటానికీ - రానటానికీ బస్సుచార్జీలకు చాలదు - యీ వచ్చే ఆదాయం! ఇక...ఉన్న రెండెకరాల గెడ్డ అమ్మాలి!

కామయ్య: ఏమో...అదంతా అన్న యిష్టం; తమ్ముడిష్టం. మన దేముందిలే.

రత్తయ్య: నువ్వో ఆ మాటంటే యిక నిరవాకమే! ఆ తమ్ముడు చదువుకుంటానంటాడు; ఈ అన్న చదివిస్తానంటాడు; ఆ ఉండది కాస్తా ఊడేదాక! తన గతి ఏమవుతుందనే ఆలోచనే లేదు.

కామయ్య: (వ్యంగ్యంగా) మావాడి మావాఁ! నువ్వో పెద్దకుడవైనందుకు ఆమాత్రం అల్లుడి క్షేమం ఆలోచించావు; సంతోషం!

రత్తయ్య: ఎందుగ్గానీ...నా మాటిని, ఈ యేడు కుర్రాడి పెళ్ళి చేసెయ్!

కామయ్య: తొందరపడితే అవుతుందీ?...కలిసిరావద్దూ?

రత్తయ్య: సంబంధం ఒకటి నాదగ్గరకు రాబట్టే - అడుగుతున్నా.

కామయ్య: అదా,...చెప్పవేం?!

రత్తయ్య: ఆఁ. పిల్ల కొద్దిగా నలుపుగానీ...దానికి తగినట్టు కట్నాం యిస్తారుమరి!

కామయ్య: ఉహూఁ?... (ఆలోచిస్తూన్నాడు).

రత్తయ్య: ఆఁ...! నలుపు దేంటి బావా?! ... మిగతా యన్నీ సరిగ్గా ఉండాలిగాని!

రామయ్య: పదిడబ్బు లెక్కువొస్తే చాలంటావ్!?

రత్తయ్య: ఆఁ! అందులోనే వుంది, ఏం ఉందా...అల్లం వుంటే - అన్ని అందాలూ వస్తయ్!

[శేఖర్ వచ్చాడు. వయస్సు - 22 సంవత్సరాలు. అందమైన యువకుడు. పైజామా, ఫుల్ షర్టు, చేతిలో పుస్తకాలు.]

కామయ్య: (రత్తయ్యతో) అడుగో...శేఖర్ వచ్చాడుగా?! ఆ సంగతి వాణ్ణే అడుగు! (శేఖర్‌తో) ఇప్పుడుదాకా ఎక్కడుండావురా?

శేఖర్: వస్తూ వస్తూ మీటింగుదగ్గర కెళ్లానూ...

కామయ్య: అప్పుడే అయిపోయిందేంటి మీటింగు?

శేఖర్: అవటంగాదు; మైక్ చెడింది నాన్నా.

రత్తయ్య: మైక్ చెడేది...చచ్చేది; అంతంత మాత్రాన వదుల్తాడూ - మా అల్లుడు బల్లెక్కినాక? దాని అంతు తేల్చుకోడూ!

శేఖర్: అత్తయ్యని మీటింగుకి పంపి, నీవు యిక్కడున్నావేఁ మాఁవా?

రత్తయ్య: (బిత్తరపోయి) ఏంటీ? వెళ్లటవేఁ??

శేఖర్ : అవును మాఁవా! మా వదినా...అత్తయ్యా... ఒకచోటే కూచ్చున్నారు.

రత్తయ్య : తాజెడ్డకోతి వనమెల్లా జెరిసిందనీ...చూశావా కామయ్య బావా! నీ కొడుకూ, కోడలూ ఎంతపని చేశారో!

శేఖర్: ఏం జేశారు?

రత్తయ్య : ఇంకేం జెయ్యాలి? కాపరానికి వచ్చిన తర్వాత గడపదాటి ఎరగదు - మీ అత్తయ్య! అట్టాంటిదాన్ని మీటింగుకి తీసుకెళతారూ!

శేఖర్ : ఎందుకు దాటలా? ... మొన్న తిరణాలకి తీసు కెళ్ళావుగా!

రత్తయ్య : తిరణాలకీ మీటింగుకీ వంతా?

శేఖర్ : (వ్యంగ్యంగా) అహ్హ......ఎందుకవుతుందీ? ఎన్ని జెప్పినా...తిరుణాల తిరణాలే! సరే గానీ మాఁవా... అక్కడేదో చాలా గొడవ జరిగిందన్నారు?

రత్తయ్య : ఎవడా అంది? జనానికి దేముడంటే ఎంత భక్తి... ఏం లోకం! సందకాడ రథం పట్టాల్నొస్తే... తన్నాదియ్యా; నేనూ, నేనూ అంటూ అట్టా యిరగ బడ్డారనుకో!!

కామయ్య : అంత జనం వచ్చారా?

రత్తయ్య : జనం - ఏంటి బావా! ... ఆ వత్తిడికి తట్టుకో లేక, ఎక్కడివాళ్ళక్కడ చీలిపోయాం!

శేఖర్ : అంతేలే; అంతకంటే జరిగేదేముందీ — అక్కడ?

రత్తయ్య : అశ్శ! అంతేనా!? ... ఆ పానకాలస్వామి దయవల్ల తెల్లారేపాటికి మనిషి బీసుపోకుండా కలుసుకున్నారు. — ఏ జంట కాజంట! తెలుసా!

శేఖర్ : (నవ్వి) మీటింగుదగ్గర అదేమీ ఉండదులే మాఁవా. స్త్రీలకు స్త్రీలూ ... పురుషులకి పురుషులూ ... విడి విడిగా కూర్చుంటారు. మీటింగు కాగానే అంతా వచ్చేస్తారు. దీని కింత కంగారెందుకూ?

రత్తయ్య : ఎందుకో ... ఏమిటో ...... నీకేం తెలుసూ - కుర్రాషికి! తిరణాల కెళ్లామంటే దాని దారి వేరు. అది పరాయిచోటు. అక్కడ కాస్త అటూ యిటూ తిరిగినా ఫర్వాలేదు. ఇక్కడంటావ్ ?...చిన్నా - పెద్దా అంతా ఎరిగినాళ్ళాయె! భుజాలు భుజాలు రాసుకుంటూ తిరుగుతారూ - వీళ్ళంతా బోయి!

శేఖర్ : (వ్యంగ్యంగా) అదంతా తిరణాల్లో.

కామయ్య : ఒరే అబ్బాయి! ఏఁవిటిరా ఆయనతో ...

రత్తయ్య : కాదు బావా! నాలు గింగిలీసుముక్క లొచ్చినయ్యని, తిరణాల కొంకబెడతాడేఁటి?? ... అక్కడి కెళితే యింత భక్తి ... ముక్తి ...

శేఖర్ : అంతేలే. భక్తులు భక్తులు భుజాలు సద్దుకున్నా ఫరవాలేదు!

రత్తయ్య : (చికాకుగా) ఆఁ...! అన్నకంటే అయిదాకులు ఎక్కువ చదివినట్టే ఉండావు! నోటి కొచ్చినట్టు మాట్లాడితే సరా? ... అయినా నీతో నాకేంటి? ... ఎళతా బావా! (వెళ్ళాడు)

శేఖర్ : మీటింగు కెళితే ... ఈయనికి తప్పట ! తప్పు !!

రామయ్య : నోర్ముయ్ రా...

శేఖర్ : అది కాదు నాన్నా. ఈ వయసులో రెండో పెళ్ళి చేసుకుని, అత్తయ్యని ఎన్ని అవస్థలు పెడుతున్నాడనీ ? కాస్త తలదువ్వి బొట్టుపెట్టుకుంటే, "ముస్తాబయ్యావు ? ఏవిటీ కథ ?" – అంటాడు. అందుకని మొదలకుండా ఊరుకుంటే, "ఏడుపు ముఖం"– అంటాడు.

రామయ్య : ఆయ నేం వాగితే యేం ? ఆ అమ్మాయి ఎంత గుణవంతురాలయిందీ లోకానికి తెలియదూ?...కర్మ!... దానికి ఒకరేం జేస్తారు ! నీ పని నువ్వు చూసుకో.

(బయటికి వెళ్ళాడు)

శేఖర్ : హుం ! కర్మట; కర్మ !!

[కూర్చుని ఏదో పుస్తకం తీసి చూస్తున్నాడు. ఇందిర వచ్చింది. వయస్సు – 18 సంవత్సరాలు. వాలుజడ; సిల్కు చీర; జాకెట్టు; మెడలో గొలుసు; వేలికి ఉంగరం; చేతులకి బంగారు గాజులు; చెవులకు చిన్న పోగులు.]

ఇందిర : (వస్తూనే) అక్కా ! అక్కా ...

శేఖర్ : ఓ...! ఇందిరా ! రా, కూర్చో.

[ఇందిర నిర్లక్ష్యంగా లోనికి వెళ్ళింది. శేఖర్, ఇందిర వెళ్ళినవైపు చూస్తున్నాడు. ఇందిర తిరిగిరావడం చూసి, శేఖర్ ఏమీ ఎరగనట్లు పైకి దృష్టి నిలిపి, దీర్ఘాలోచనలో నిమగ్నుడయ్యాడు.]

ఇందిర : (వచ్చి) ఏం శేఖర్ ! అరుణక్కాయి లేదే లోపల ?

శేఖర్ : (విననట్లు నటించాడు)

ఇందిర : (శేఖర్ వంక తేరిపారజూచి, అతని ముఖంముందు తన చెయ్యి అటూ యిటూ త్రిప్పుతూ) అసలు ఈ లోకంలో లేనట్లుందే!

శేఖర్ : ... (అయినా పలకలేదు)

ఇందిర : ఏయ్! నిన్నే ...

శేఖర్ : ఉష్!

ఇందిర : సరే. (తల పంకించి, లోనికి వెళ్ళింది. గ్లాసుతో నీళ్ళు తెచ్చి శేఖర్ ముఖంమీద చిలకరించింది)

శేఖర్ : (తన చేతులను ముఖానికి అడ్డంపెట్టుకుని) ఏయ్ ... ఏయ్

ఇందిర : (నవ్వింది.)

శేఖర్ : (దిగ్గున లేచి) అబలా! తపోభంగ మొనర్చితివి. నిన్నిదే శపించెదను.

ఇందిర : (భయం నటిస్తూ), శాంతమే భూషణం స్వామీ! నన్ను కనికరించండి.

శేఖర్ : (గంభీరముగా) ముందా యాసన మలంకరింపుము!

ఇందిర : (భయం నటిస్తూనే) చిత్తం. (కూర్చుంది.)

[ఇద్దరూ విరగబడి నవ్వారు]

శేఖర్ : ఆఁ... చిన్న ధర్మ సందేహం! ఏఁవిటి నీ సలహా ఇందిరా?

ఇందిర : ధర్మసందేహమా? నా సలహా? ...

శేఖర్ : అవును. నా క్లాస్ మేట్ ఒకతనున్నాడు. నూరు ఎకరాల పొలమూ ... కావలసినంత డబ్బూ వుంది.

ఇందిర : ఊఁ ... ఉంటే?

శేఖర్ : అతను ఒక పేదవాళ్ళ అమ్మాయిని ప్రేమించాడు. ఆమె స్కూల్ ఫైనల్ చదువుతూ మానేసింది.

ఇందిర : మా ఆడవాళ్ళ చదువులు అంతేలే !

శేఖర్ : అది కాదు ! వాళ్ళు పేదవాళ్ళు. ధనవంతులైతే యుక్తవయసు వచ్చిందని మానేస్తారనుకో...

ఇందిర : ఏయ్... శేఖర్ !

శేఖర్ : ఎందుకట్లా ఉలికిపడతావ్ ? మనం మాట్లాడేది నిన్ను గురించి కాదుగా ! (నవ్వి) ఆఁ...వాళ్ళిద్దరూ పెండ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నారు.

ఇందిర : ఇంకేం ? మంచిదే !

శేఖర్ : మంచిదే. వచ్చిన చిక్కు ఎక్కడంటే ... అతని బ్రదరూ... బంధువులూ... ఈ వివాహానికి అంగీకరించ లేదు.

ఇందిర : అందుకని మానుకున్నాడా ?

శేఖర్ : ఇంకా లేదు. అతనికేంతోచక, నన్ను సలహా అడిగాడు. ఏం చెప్పాలో తెలియక నేను నిన్నడుగు తున్నా.

ఇందిర : నీ స్నేహితుడు అసమర్థుడా ?

శేఖర్ : కాదు.

ఇందిర : అయితే అతనిది కపట ప్రేమన్నమాట !

శేఖర్ : ఎందుకని ?

ఇందిర : కాకపోతే... ఎవరో వద్దన్నారని, ప్రేమించిన పిల్లని పెళ్ళిచేసుకోకుండా మానుకుంటాడా ?

శేఖర్ : ఆఁ ... ఈ కబుర్లకేంలే ! ఒకవేళ ఆ అమ్మాయికే యిలాంటి సంధిగ్ధావస్థ వచ్చిందనుకో ! అప్పుడేమంటావు— నువ్వు ?

ఇందిర : ఎప్పుడైనా నేననేది యింతే !

శేఖర్ : నిజంగానా ? (తలవంచి బయటికి చూశాడు)

ఇందిర : ఎవరు ... అరుణక్కాయి వస్తోందా ?

శేఖర్ : కాదు; మీ అన్నయ్య !

ఇందిర : ఆఁ ! (తత్తరపడి లేచింది)

శేఖర్ : ... (పకపక నవ్వాడు)

[ అరుణ వచ్చింది. ఇందిర నిట్టూర్చింది. ]

అరుణ : ఏఁవిటమ్మా ?

ఇందిర : ఏమీ లేదక్కా. నీ వున్నావేమోనని...వచ్చాను.

శేఖర్ : లేవని వెళ్ళిపోతోంది.

అరుణ : (ఇద్దరివైపూ చూస్తూ) కాదు; వచ్చాననని !

ఇందిర : (సిగ్గుతో తలవంచుకుని) ఊఁ ... పో అక్కా...

అరుణ : (నవ్వి) సరేగానీ ... ఇంతకూ నీవు మీఇంటికి రాలేదేం ?

శేఖర్ : నీవూ వెళ్ళేదానివి గాదు; మా అన్నయ్య పట్టుపట్టి ఉండకపోతే. ఏం వదినా ?

అరుణ : నేను అడిగేది ఇందిర విషయం !

శేఖర్ : అది దీని కెదురు. వీళ్ళన్నయ్య—కేశవరావుగారు వద్దని ఉంటాడు !

అరుణ : అదేంకాదు. మధ్యలో నీవు అడ్డు తగిలుంటావు !

శేఖర్ : నేనా !

అరుణ : అవును. (ఇందిరతో) ఏం ఇందిరా ?

[ తెరవెనుక మైక్‌లో ]

2 వ గొంతు : సోదరులారా ! కేశవరావుగారు తమ అధ్యక్షోపన్యాసం ప్రారంభిస్తున్నారు.

[ఇందిర ఏదో చెప్పబోతుంది]

శేఖర్ : (ఆమెను వారిస్తూ) ఆగండి; ఆగండి, అధ్యక్షులవారు మాట్లాడుతున్నారు.

ఇందిర : వెళతా నక్కా ...

అరుణ : ఉండమ్మా ... వెళ్ళొచ్చు.

ఇందిర : కాదు; వెళ్ళాలి. (లేచింది)

[మైక్‌లో కేశవరావు సకిలించాడు. ఇందిర వెళ్ళింది.]

శేఖర్ : (నవ్వి) ఇందిరను మీటింగుకి రాకుండా అడ్డు తగిలిం దెవరో యిప్పుడైనా అర్థమయిందా వదినా ?

[తెరవెనుక, కేశవరావు ఉపన్యాసం ప్రారంభించాడు.]

కేశవ : సోదరులారా ! మైక్ చెడినా, లెక్కచేయక ... మాధవరావుగారు తమ కంచుగొంతు విప్పి, ఇంతవరకూ అనర్గళంగా మాట్లాడారు. గ్రామోద్ధరణ సంఘం స్థాపించి, వీరు మన గ్రామానికి చేస్తున్న సేవ అపారం. నేటనుంచీ... నేనుకూడా నా ఓపానుశక్తి వీరికి తోడ్పడతానని హామీ యిస్తున్నాను. సెలవు.

(చప్పట్లు)

శేఖర్ : (చప్పట్లు కొడుతూ) హియర్ హియర్ ! ఏం పరివర్తన !! హియర్ హియర్ !

అరుణ : నీ కేమన్నా పిచ్చిపట్టిందా అబ్బాయి ?

శేఖర్ : కేశవరావుగారిలో అంత మార్పురావడం సామాన్య మైన విషయమా వదినా ? నిజంగానే నేను పిచ్చి వాణ్ణయ్యాను.

అరుణ : అయితే మీ అన్నగారి ఉపన్యాసం వింటే ... యింకేమైపోయేవాడివో ! ! మరి వచ్చేశావేం ?

శేఖర్ : మైక్ చెడిందిగా ? ... పుస్తకాలు యింటిదగ్గర పెడదామని వచ్చాను.

అరుణ : ఆఁ... ఆఁ...ఇంతలో ఇందిర వచ్చింది. అంతేగా !

శేఖర్ : అది కాదు వదినా ...

అరుణ : కేశవరావుగారు ధనికుడు. తన చెల్లెల్ని మనలాంటి వాళ్ళ కివ్వడానికి అంగీకరిస్తాడంటావా ?

శేఖర్ : అంగీకరించకపోవచ్చు.

అరుణ : కనుక ఇందిరతో యింత చనువుగా వుండటం ...

శేఖర్ : నష్టం చెయ్యదంటావ్ వదినా ?

అరుణ : మీ యిద్దరూ ఒకర్నొకరు ఎంతగా ప్రేమిస్తున్నారో తెలియక కాదనాయనా నేను చెప్పేది.

శేఖర్ : అయితే ఈ విషయం ఇందిరకు చెప్పడం మంచిది.

అరుణ : అదీ అయింది.

శేఖర్ : (ఆతురతగా) చెప్పావా ?... ఏమంది వదినా ?

అరుణ : ఏదో అందిలే.

[లోనికి పోబోయింది. శేఖర్ ఆమెకు అడ్డంవచ్చి]

శేఖర్ : వదినా :

( పా ట )

వదినా వదినా చెప్పవుగా
చెప్పక నీ కిక తప్పదుగా... ॥వదినా॥

కన్నబిడ్డలా ప్రేమించి
అన్ని విద్యలూ నేర్పించి
నన్నొక మనిషిని చేశావూ - నా
మనస్సు తెలిసిన దేవతవూ ... ॥ వదినా ॥

పాదం మోపీమోపగనే
ఇంటిని స్వర్గం చేశావూ మా
ఇంటిని స్వర్గం చేశావూ
ఆకలిదప్పులు తెలిసి తీర్చి మా
అమ్మనె మరిపించేశావూ ... ॥ వదినా ॥

పెను తుఫానులకు చలించకుండా
నిలచు హిమాచల మా మనసు
నిశ్చలమైనది నీ మనసు
నిష్కల్మషమైనది ఆ మనసు ... ॥ వదినా ॥

మాధవ : (ప్రవేశిస్తూ) ఆహాహా !! అద్భుతంగా పాడేవు !

శేఖర్ : థాంక్స్ అన్నయ్యా ...

మాధవ : నీ మొహం ! నీ వేం పాడతావురా? ! మీ వదిన యిందాకా మీటింగులో పాడిందీ ... ఓహ్ !! ... (అరుణతో) అరుణా ! జనాన్ని ఊపేశావనుకో ! కొంచెం

భయపడ్డావు కదూ ?... అందుకే మొకట గొంతు కాస్త వణికింది. స్టేజిఫియర్ అంటే సభాపిరికి ఉండకూడదు. సరే గానీ...కొద్దిగా మంచినీళ్ళు తీసుకురా.

[ అరుణ లోనికి వెళ్ళింది. శేఖర్ టేబిల్ వద్ద పుస్తకాలు సర్దుతూన్నాడు. ]

మాధవ : (శేఖర్‌తో) ఏంరా ... మీటింగుకి రాలేదా ?

శేఖర్ : వచ్చాను. సరిగ్గా నేను వచ్చేటప్పటికే వదినె పాట ప్రారంభమయింది.

మాధవ : ఓ... అయితే విన్నానన్నమాట ! ఎట్లా ఉందిరా ?

[ అరుణ గ్లాసుతో మంచినీళ్ళు తీసుకువచ్చింది. ]

శేఖర్ : (వదినవైపు చూచి, నవ్వుతూ) మళ్ళీ ఒకసారి వింటే గానీ ...

అరుణ : (గ్లాసు మాధవరావు కందిస్తూ) సరే; ఇంక నాకు వేరే పనేముంది ? మామగారు వచ్చేవేళయింది. తొందరగా వంట చెయ్యాలి.

మాధవ : (మంచినీళ్ళు త్రాగి, గ్లాసు యిస్తూ) ఎక్కడికి వెళ్లారాయన ?

శేఖర్ : రత్తయ్య మామని ఓదార్చటానికి !

అరుణ : ఆఁ !

శేఖర్ : అవును. అత్తయ్యని మీటింగుకి తీసుకెళ్లారని గోల పెడుతున్నాడాయన !

అరుణ . చూశారా ? ...నేను చెబితే విన్నారు కాదు.

మాధవ : కంగారుపడకు. నేను వెళ్ళి, రెండు మాటలు చెప్పానంటే అయిదు నిమిషాల్లో దారికి రాడూ ?

అరుణ : ఏమిటో... మాటలవల్ల ఏమవుతుందంటి...

మాధవ : మాటలవల్ల కాని దొకటుందా? ఊరికే చెప్పాడూ భర్తృహరి...

ఉ॥ "భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁ జేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

అరుణ : ఉపన్యాసాలతోనే దుంప తెగిపోతోంది. ఇంకా సంగీతం కూడా ఏం పాడతారులెండి !

మాధవ : ఆఁ... మర్చిపోయాను ! నా ఉపన్యాసం పూర్తిగా వినకుండానే వచ్చేశావేం ?

అరుణ : ఏం చెయ్యను ? ... పిన్ని తొందరపెట్టింది. అయినా మీ ఉపన్యాసం అక్కడే వినాలనేముంది ? రోజూ యిక్కడ వింటూనే ఉన్నానుగా ?...

మాధవ : చంపావు పో !

అరుణ : మీటింగుదగ్గర లక్ష్మమ్మగారు కనిపించింది.

మాధవ : ఆఁ...ఆఁ... ఆమె మంచి వర్కరు లే !

అరుణ : చాలా మంచి విషయాలు చెప్పింది. స్త్రీలు ఎందుకు ముందుకు రావాలో ... ఏం చెయ్యాలో ... ఎట్లా చెయ్యాలో - చెప్పింది.

మాధవ : నేను చెప్పిందీ అదేగా ?

అరుణ : చెప్పారనుకోండి ...

మాధవ : అయితే ... యిక నన్ను విసిగించకుండా ప్రతి మీటింగుకీ వస్తానన్నమాట !

అరుణ : దానిదేముందిగానీ ... తీరిక సమయంలో నాకు చేతనైన అల్లికపనీ ... కుట్టుపనీ ... మనవాళ్ళ నలుగురికీ నేర్పుదామని ఉంది.

మాధవ : ఓ యస్ ! ఇప్పుడూ నిజమైన భార్యవు. నేను ఊహించుకున్న భార్యవు. కాటేజ్ యిండస్ట్రీ వర్కుంటే యిదే ! భూషయ్యన్న యిల్లొకటి కాళీగావుంది. నలుగురూ రానటానికి చాలా అనుకూలమైన స్థలం. ఆయనతో నేను మాట్లాడుతాను — గానీ ... రేపటి నుంచే అక్కడ క్లాసు ఏర్పాటుచెయ్యి. ఊఁ ?

అరుణ : సరేలెండి.

[ తెర ]

# రెండో రంగం

[ కేశవరావుగారి యిల్లు : హాల్లో కుర్చీలూ, సోఫాలూ, ఒక టేబిలూ ఉన్నాయి. గోడలకు సినిమాతారల ఫోటోలూ, కేలండర్లూ, ఒకటి - రెండు యూరోపియన్ లేడీస్ అర్ధనగ్నచిత్రాలు కూడా ఉన్నాయి.

తెర లేచింది. సుబ్బన్న ఫోటోలమీద దుమ్ముదులుపుతూ, వస్తువులను అటూ - యిటూ సర్దుతున్నాడు. తెరవెనుక ... ఇందిర ఏదో రాగాలాపన చేస్తూంది.

శేఖర్ వచ్చాడు. అతని చేతిలో ఒక పెద్ద కాతా పుస్తకమూ... రెండు యింగ్లీషు పుస్తకాలూ ఉన్నాయి. ]

సుబ్బన్న : రా బాబూ, రా !

[ ఇందిర ఆలాపన ఆపివేసింది ]

శేఖర్ : (సుబ్బన్నతో) ఏం తాతా ! మీ బాబుగారు రేడియో తెచ్చారా ?

సుబ్బన్న : లేదే...

శేఖర్ : ఈ యింట్లోనుంచీ ఏదో పాట వినిపించి తేను...

అట్లా అనుకున్నాలే.

[ఇందిర వచ్చింది.]

సుబ్బన్న : అదా... (నవ్వి) ఒక లేడియో ఉందిగానీ...మన యిష్టంవచ్చినప్పుడు పాడదు; తన యిష్టంవచ్చినప్పుడు తప్ప !

ఇందిర : ఏయ్... తాతా !

సుబ్బన్న : లేదులే; లేదులే అమ్మా.

[శేఖర్ వస్తాడు.]

సుబ్బన్న : ఏంబాబు ! బళ్లోనుంచేనా ... రావటం ? ఇంకెన్నాళ్లు తిరగా లిట్లా ?

ఇందిర : చదువు పూర్తయేదాకా ! ఏం శేఖర్ ! కాలేజి నుంచేగా ?

శేఖర్ : వచ్చి గంటయ్యింది. ఇంతవరకూ యింటికి వెళ్లలా. ఎన్ని పనులు... !

ఇందిర : పాపం; ఏమిటండీ తమరు చేసే పనులు ?

శేఖర్ : లక్ష ! బస్తీ కెళ్ళేవాడికి పల్లెటూళ్లో పనులు చెప్పేవాళ్ళు కరువా ? మా రత్తయ్య మామకు వంకాయలు, బీరకాయలు, దోసకాయలు, బంగాళా దుంపలు...రోజు కొక రకం తీసుకురావాలి.

ఇందిర : అవన్నీ యిక్కడ దొరికేవేగా ?

శేఖర్ : దొరకవని కాదు. ఇక్కడకంటే అక్కడ ఒక్క కానీ చౌకట !

సుబ్బన్న : చేసేవాడు ఉండాలిగానీ, పందిరగుంజకి పని చెప్పడూ - ఆయన !

శేఖర్ : మొన్న యీమధ్య ... గేదెకు వాతం జేసిందని, వారం రోజులు కొబ్బరికాయలు మోయించాడు నా చేత.

ఇందిర : ఆయన మీ మానగారు గనక తెచ్చావు!

శేఖర్ : అదేంగాదు. ఆ ముసలమ్మ లేదూ? ... సీతమ్మ గారు ...

ఇందిర : ఊఁ.

శేఖర్ : మర్యాదగా పిల్చి, ఒక అణా యిచ్చి ఆంజనేయుని బిళ్ళ తెమ్మంది. ఆమె మాట కాదనడమా...తేవడమా?

ఇందిర : ఎందు కది ఆమెకు ?

శేఖర్ : ఆమె మనవఁడు జడుసుకున్నాడట !

[ ఇందిర నవ్వింది ]

సుబ్బన్న : అవును మరి; అంతా గుమ్మడికాయంత ముత్తాలే !

శేఖర్ : ఇట్లాగే! ఒకరి అబ్బాయికి బెలూన్లు, మరొకరి అమ్మాయికి రిబ్బన్లు, యింకొకరి పాపకు తలపిన్నులు ... (ఇందిరతో) నీకూ్కూడా ఏమైనా కావాలా ? చెప్పు! ఇవంతా ఎందుకు; మీ అన్నగారి ఆజ్ఞ శిరసావహించి, ఈ కాతా పుస్తకం తెచ్చాను; చూడు.

[శేఖర్ పుస్తకాన్ని ఇందిరకు అందించాడు. ఆమె పుస్తకం తీసుకొని, డ్రాయర్ మీద పెట్టింది. శేఖర్ బయలుదేరాడు.]

సుబ్బన్న : ఎల్తన్నావేం బాబూ ? (కొంచెం ముందుకు వచ్చాడు)

శేఖర్ : వెళ్ళాలి. ఇదిగో తాతా మర్చిపోయాను... చిల్లర డబ్బులు మిగిలినై గానీ ... ఇవికూడ కేశవరావుగారి కివ్వండి. [ సుబ్బన్నకు చిల్లర యివ్వబోయాడు. ]

ఇందిర : వద్దు తాతా! తీసుకోకు! మన కెందుకొచ్చిన గొడవ? అతనే యిచ్చుకుంటాడు. (శేఖర్ వైపుచూచి నవ్వింది)

సుబ్బన్న : (ఇందిర ముఖాన్ని తేరిపారజూచి, ముసిముసి నవ్వుతో) పిచ్చి తల్లీ! (లోనికి వెళ్ళాడు)

శేఖర్ : సరే! ఏం చేస్తాం! తప్పుతుందీ? (కూర్చున్నాడు)

ఇందిర : ఇంటింటికీ తిరిగి, సామానులన్నీ వప్పగించి, అలసి పోయారనుకుంటాను! మంచినీళ్ళు యివ్వనా?

శేఖర్ : అక్కర్లేదు. అవిమాత్రం యింటింటికగ్గరా యిస్తూనే ఉంటారు!... సరేగానీ, ఇందిరా! మా వదిన నీతో ఏమైనా చెప్పిందా?

ఇందిర : చెప్పింది.

శేఖర్ : (ఆసక్తిగా) ఏంజెప్పిందీ?

ఇందిర : అనేక విషయాలు! కుట్టుపని గురించీ...చదువును గురించీ..దేశాన్ని గురించీ...ఇంకా చాలా చాలా..

శేఖర్ : అదిగాదు ఇందరా...

ఇందిర : ఏదికాదూ? నీకు కావలసిందేదో అడగరాదూ?

శేఖర్ : చెప్తావా?

ఇందిర : విషయం చెప్పకుండా చెప్తావా — అంటే?

శేఖర్ : పోనీ...ఏమైనా అడిగిందా?

ఇందిర : అనేకం అడుగుతుంది. మొన్న కలిసినప్పుడు... భోజనంచేశావా?..."నేను యిచ్చినపుస్తకం చదివావా?" అని అడిగింది.

శేఖర్ : అబ్బ...

ఇందిర : (తలగోక్కుంటూ) ఇంకేమిటబ్బా ?... (జ్ఞప్తికి వచ్చినట్టు) ఆఁ ! ఇంకో విషయంకూడా అడిగింది

శేఖర్ : అడిగిందీ ?...అడిగితే నీ వేం సమాధానం చెప్పావ్ ?

ఇందిర : ఎందుకూ ?

శేఖర్ : మరేం లేదు; తెలుసుకుందామని ! అంతే. ఏం చెప్పావ్ ?

ఇందిర . (తలవంచుకుని) ఏం చెప్పనూ...

శేఖర్ : ఏమీ చెప్పనేలేదా ?

ఇందిర : (తలవంచుకునే) నిన్నూ అడిగిందా ?

శేఖర్ : లేదు; మందలించింది.

ఇందిర : ఏమని ?

శేఖర్ : ముందు నీవు చెప్పితే...

ఇందిర : ఊహించుకోలేవా ?

శేఖర్ : నా ఊహ రైటు కావచ్చు; తప్పు కావచ్చు. చెప్పితే నోటి ముత్యాలు రాలిపోవులే ! చెప్పు ఇందిరా; చెప్పు ఆమె ఏమని అడిగిందీ ? నీవేం చెప్పావ్ ?...

ఇందిర : ఏదో చెప్పాను. ఉండు; వస్తా.

[లోనికి వెళుతూఉంది]

శేఖర్ : (లేచి) ఇందిరా !

ఇందిర : వెళ్ళకు. ఉండు; యిప్పుడే వస్తాను.

[శేఖర్ అటూ - యిటూ పచారు చేస్తున్నాడు. బయటినుండి కేశవరావు వచ్చాడు.]

కేశవ : (వస్తూనే) ఏమిటోయ్ శేఖర్ ! ఇలా వచ్చావు ? తెచ్చావా కాతా పుస్తకం ?

శేఖర్ : ఆఁ, తెచ్చాను. (టేబిల్ మీది పుస్తకం ఆయనకు అందిస్తూ) దీని వెల మూడున్నర. మీరు నాకు యిచ్చింది- అయిదు. మిగతా డబ్బులు ... (జేబులో చేయి పెట్టాడు.)

కేశవ : ఉండనివ్వు. ఇవ్వవచ్చు ... తొందరేవిఁటి ?...

శేఖర్ : ఎందుకులెండి. (జేబులోనుంచి రూపాయిన్నర తీసి కేశవరావు కిస్తూ) వెళతాను.

[ఇందిర కాఫీగ్లాసుతో వచ్చి, అన్నను చూచి కంగారుపడి, శేఖర్ కని తెచ్చిన కాఫీని అనే త్రాగుతూ లోనికి వెళ్ళింది. శేఖర్ నవ్వు కుంటూ వెళ్ళాడు. కేశవరావు యిదంతా గమనించాడు.]

కేశవ : (కూర్చుంటూ) ఇందిరా !

ఇందిర : (లోపలినుంచి వస్తూ) ఏవిఁటన్నయ్యా ?

కేశవ : ఇప్పుడు కాఫీ ఏమిటమ్మా ?

ఇందిర : కొంచెం బద్ధకంగా ఉంటేను ...

కేశవ : ఓహో ... (సుబ్బన్న కాఫీ తెచ్చి కేశవరావుకు అందించాడు.) యిప్పుడేవిఁటి సుబ్బన్నా ? ...

సుబ్బన్న : తాగు బాబూ, కాఫీనీళ్ళకి యేలేంటి ... పాలేంటి ! ...

కేశవ : (నవ్వుతూ కాఫీ అందుకుని) ఒక శుభవార్త సుబ్బన్నా ...

ఇందిర : వదినె వస్తూందికాబోలు తాతా !

సుబ్బన్న . ఏం బాబూ ?...

కేశవ : అది ఈ జన్మలో జరిగేపనిగాదు. దాని బాబు— ఆ కట్నం తాలూకు డబ్బు యిచ్చేదీ లేదు. నేను దాన్ని తీసుకొచ్చేదీ లేదు !

సుబ్బన్న: ఆబోతులాబోతులు పోట్లాడుకుంటే...నడాన లేగలు నలిగి చస్తావుంటయ్ ! అంతేగా ?

కేశవ : (విసుగ్గా) పోనియ్...వెధవ గొడవ !

సుబ్బన్న : మరేంటి బాబూ ?... అమ్మాయికేదైనా...

కేశవ : (నవ్వుతూ) ఆఁ...ఆఁ! లక్ష్మీపురంనుంచి వచ్చారు.

[ ఇందిర లోనికి వెళ్ళింది ]

సుబ్బన్న : లచ్చింపురంనుంచా ?... ఎవరబ్బా ?

కేశవ : వెంకయ్యగారని...

సుబ్బన్న : మోతుబరి ఎంకయ్యగారా ?

కేశవ : అవును. ఏం ! .. ఆయన్నెరుగుదువా ?

సుబ్బన్న : ఆయన్నెరగనాళ్లుంటారా ? ఆ చుట్టుపట్ల అయిదా రూళ్ల డబ్బంతా ఆయన దగ్గరే పోగడివుంది.

కేశవ : అమ్మాయి అదృష్టవంతురాలు గనుకనే ఈ సంబంధం వచ్చిందనుకో !

సుబ్బన్న : ఎవరి అదుష్టం ఎట్టావుందో ఎవరు చూశారు బాబూ...

కేశవ : వారు మన రత్తయ్యగారి యింటిదగ్గర కూర్చొని మాట్లాడుతున్నారు. నేను వెళ్ళి తీసుకువస్తాను, తగిన ఏర్పాట్లు చెయ్యి. ఈలోగా అమ్మాయిని...

సుబ్బన్న : ఆఁ... ఆఁ...! చెప్పాలా బాబూ ?

[కేశవరావు వెళ్ళాడు. సుబ్బన్న వింగువాకా వెళ్ళి, కేశవరావు వెళ్ళినవైపు చూస్తున్నాడు. ఇందిర వచ్చి కుర్చీ పట్టుకుని నిర్జీవ ప్రతిమలా నుంచుంది. సుబ్బన్న మెల్లగా ఆమె దగ్గరకు వచ్చాడు.]

సుబ్బన్న : విన్నావా అమ్మా ?

ఇందిర : వదినె వస్తున్నదేమోనని ఆశపడ్డాను.

సుబ్బన్న : (నిట్టూర్చి) ఒదిన! డబ్బుకోసం లచ్చిందేవంటి ఇల్లాల్ని వదిలిపెట్టి కూర్చున్నాడు. ఆమె తండ్రి డబ్బు మొఖంచూసే మనిషి కాదు. సంసారం చితికిపోయి ... పెగలక కొట్టుకుంటున్నాడు గాని ...

ఇందిర : అన్నయ్య యిక వదెనను తీసుకురాడంటావా తాతా? ...

సుబ్బన్న : ఏం జెప్తాం! ఇష్టమొచ్చినట్టు తిరిగేవాళ్లకి, ఎదటి మనిషి కష్టసుఖాలు ఏం తెలుస్తయమ్మా? ఇంతెందుకూ? ... నీ కేదో సంబంధం తీసుకొచ్చాడు; బాగానే ఉంది ...

ఇందిర : ఏం బాగు? ... అది సంబంధం కాదు తాతా; నా మెడకు ఉరి!! అమ్మా ...? నాన్నా ...? చివరకు వదినెకూడా లేదు! ... ఇక లాభంలేదు తాతా... ఉన్న విషయం అన్నయ్యతో చెప్పేస్తాను.

సుబ్బన్న : అన్నయ్యతోనా? ... అంతకన్నా ఈ గోడకు చెప్పడం మంచిదమ్మా!

ఇందిర : (గద్గద కంఠంతో) అయితే నాకు చావు తప్పదు!

సుబ్బన్న : చావా?

ఇందిర : ఇంకోమార్గం లేదు తాతా.

సుబ్బన్న : అవును, -నీకేంటి?... మామావాళ్ళకే దారి లేకుండా పోయింది. అన్న బలభద్రుడు, చెల్లెలు సుభద్రమ్మను దుర్యోధనుడి కియ్యాలనుకున్నాడు. అది ఆ మెక్కు

నచ్చక, చెర్వోదూకి చచ్చిపోయింది! మరి నువ్వెట్టా చచ్చి పోవాలనీ ? విసం మింగా ? నూతిలో దూకా ??

ఇందిర : తాతా ! ఏవిఁటి ఆమాటలు ?

సుబ్బన్న : అవునమ్మా. నీ చావు నీతోనే పోదు. నీకోసం శేఖర్ బాబు, ఆయనకోసం ఆయన బాబు, ఇట్టాగే నిన్ను కావాలనుకున్నవాళ్ళు - నీకోసం; ఆయన కావాలను కున్నవాళ్లు ఆయనకోసం... వరసబెట్టి చచ్చిపోతే సరి !

ఇందిర : (గాద్గదికంగా) తాతా...

సుబ్బన్న ; లేకపోతే చావటం ఏంటమ్మా ? చచ్చి, ఎవర్ని సాధిస్తాం ? హుఁ ! ఇదేనా నువ్వు అరుణమ్మ దగ్గిరి నేర్చు కుంది ? పద, పద లోపలికి. (ఇందిర లోనికి బయలుదేరింది.) ఇట్టాంటప్పుడే ధైర్యంగా ఉండాలి.

ఇందిర : (ఆగి) ఏమో తాతా ...

సుబ్బన్న : మళ్ళీ ఆళ్ళొస్తారు; నీ కెందుకూ ? నువ్వెళ్లి బట్టలు మార్చుకో. చెప్పినమాట విను !

[ఇందిర లోనికి వెళ్ళింది. సుబ్బన్న కుర్చీలూ వగైరా సర్దు తున్నాడు. కేశవరావు, రత్తయ్య, వెంకయ్యా వచ్చారు. వాళ్లను చూచి, సుబ్బన్నకూడా లోనికి వెళ్ళాడు.]

కేశవ : (వెంకయ్యకు కుర్చీ చూపుతూ) దయచేయండి. కూర్చోండి.

వెంకయ్య : (ఇల్లు నాలుగువైపులా కలయజూస్తూ) ఈ భవంతి మీ నాన్నగారు కట్టించిందే ననుకుంటా. (కూర్చున్నాడు)

కేశవ : అవునండి. తర్వాత కొద్దిగా రిపేరు చేయించాను.

వెంకయ్య : అట్లాగా ...

రత్తయ్య: రిపేరీ ఏమిటండీ ... పదివేలు ఖర్చుపెట్టాడు !
కేశవ: ఆఁ ... మర్చిపోయాను. మంచితీర్థం తీసుకోరూ ?
వెంకయ్య: అహఁహ ! అక్కర్లేదు.
రత్తయ్య: అబ్బాయి వయస్సెంతండీ ?
వెంకయ్య: వచ్చే కార్తీక మాసానికి యిరవై అయిదు...
కేశవ: అమ్మాయికి పద్ధెనిమిది.
రత్తయ్య: సరిపడ యీడే !
కేశవ: మిమ్మల్ని బట్టి చూస్తే కుర్రవాడు ఎరుపే అయ్యుండాలి.
వెంకయ్య: అంత ఎరుపు కాదులెండి. వాడికి మేనమామ రంగు వచ్చింది.
కేశవ: అసలా కుటుంబమంతా నలుపేనేమో ?
రత్తయ్య: నలుపూ ఎరుపులో ఏం ఉంది ? మొఖాన సిరి ఉండాలి గాని ! ఒక్కొక్క మనిషి నలుపైనా ఎంత అందంగా ఉంటాడు !
వెంకయ్య: మా వాడికి ఎర్రటిపిల్ల కావాలని పట్టుకుంది. లేకపోతే ఈపాటికి అయిపోవలసిందే ! మొన్న...కుదిరిన సంబంధమే వదులుకున్నాం !
రత్తయ్య: పిల్ల నలుపనేనా ?
వెంకయ్య: అవును.
రత్తయ్య: ఈ అమ్మాయి మంచి ఎరుపు !
వెంకయ్య: ఎరుపులోకూడా...రకరకాలు !
రత్తయ్య: అమ్మాయికి మాత్రం వంకబెట్టే పని లేదులెండి.
కేశవ: ఇదంతా ఎందుకు ? చూడండి; అభ్యంతరం లేదు. ఇంతకీ అబ్బాయి ఏం చదువుకున్నాడు ?

వెంకయ్య: థరుడుఫారందాకా చదివాడు. ఒంటరిగాణ్ణి;
సాగక, చదువు మాన్పించాను.
రత్తయ్య: మంచిపని చేశారు.
వెంకయ్య: అందులో నాకు ఉద్యోగాపేక్ష లేదు.
కేశవ: ఈ చదువుకున్న వాళ్లందరికీ ఉద్యోగా లేడిసినయ్యాట లెండి!
రత్తయ్య: చదువు ఉంటేయేం లేకుంటేయేం! లక్ష్మి పుత్రుడు!
కేశవ: ఇంతికీ అమ్మాయిని చూడాలంటూరా?
వెంకయ్య: నాకు మీ మాట చాలనుకోండి. రేపు మా వాళ్లు "పిల్లని చూశావా?" అంటే...ఏం చెప్పనూ? అందుకని...
కేశవ: అలాగే! (లోనికి చూస్తూ) అమ్మాయి ... ఇందిరా! కాఫీ తీసుకురామ్మా.
వెంకయ్య: పేరు, ఇందిరా?
రత్తయ్య: అబ్బాయి పేరు?
వెంకయ్య: దేవయ్య. మా నాన్నగారి పేరులెండి!
కేశవ: ఓహో ...

[ఇందిర వచ్చింది. మంచి దుస్తులు వేసుకుంది. చేతిలో ట్రే; దానిలో కాఫీ కప్పులూ, పంచదార గిన్నె, స్పూనులూ వగైరా ఉన్నాయి. వస్తూ వస్తూ కుర్చీ తగిలి, ముందుకు తూలింది.]

రత్తయ్య: ఆఁ...ఆఁ...
కేశవ: పర్వాలేదు. (ఇందిరతో) కాఫీ యివ్వమ్మా.

[ఇందిర ముగ్గురికీ మూడు గ్లాసులు అందించింది.]

వెంకయ్య : (ఒక్క గుక్క వేసి) అబ్బ! చేదుగా ఉంది.

కేశవ : మీకు ఎంత పంచదార కావాలో తెలియక, తక్కువగా వేసి ఉంటుంది (ఇందిరతో) వెయ్యమ్మా ...

[ఇందిర రెండుమూడు స్పూనులు పంచదార వేసింది. వెంకయ్య యిది గమనించకుండా ఇందిరవైపు చూస్తున్నాడు.]

కేశవ : చాలమ్మా!

వెంకయ్య : (తెప్పరిల్లి) చాలు; చాలు.

[ఇందిర పంచదార వేయడం ఆపి; ట్రే తీసుకుని లోపలికి వెళుతూ కుంటింది.]

కేశవ : (లోనికి వెళుతూ) వస్తాను.

వెంకయ్య : వెళ్ళిరండి.

రత్తయ్య : ఏమండీ వెంకయ్యగారూ! పిల్ల నచ్చిందా?

వెంకయ్య : పిల్ల నచ్చడం ... నచ్చకపోవడం...

రత్తయ్య : కట్నంమీద ఆధారపడి ఉందంటారు! అదెంత సేపు?... ఇప్పుడు తేల్చేస్తాను.

[సుబ్బన్న వచ్చాడు.]

రత్తయ్య : ఇదుగో సుబ్బన్నా! మీ దొరగార్ని యిట్టా పిలువు!

సుబ్బన్న : మిమ్మల్నే రమ్మంటున్నారండీ!

[రత్తయ్య వెంకయ్యను చూస్తాడు]

వెంకయ్య : సరే; వెళ్ళిరండి.

[రత్తయ్య లోనికి వెళ్ళాడు.]

సుబ్బన్న : దణ్ణాలండీ దొరగారూ!

వెంకయ్య : (ఎగాదిగా చూస్తాడు.)

సుబ్బన్న : సుబ్బన్ననండీ ...

వెంకయ్య : (గుర్తుబట్టి) ఓరి నీదుంపతెగ ! నువ్వా !...గుర్తే పట్టలేదు.

సుబ్బన్న : మీ దగ్గర మానుకుని ఏళ్ళయింది. ఏంగుర్తు పడతారూ ?...అప్పుడునుంచీ యిక్కడే లెండి !

వెంకయ్య : సరేగానీ...ఇట్లారా !

[ సుబ్బన్న మెల్లగా ఆయన దగ్గరకు వెళ్లాడు. ]

వెంకయ్య : (మెల్లగా) ఈ పిల్ల సంగతేవిఁటీ ?

సుబ్బన్న : చూసుకున్నారుగా ?

వెంకయ్య : ఆ చూట్టానికేంలే ! ఇంతకూ పిల్ల మంచిదేనా?

సుబ్బన్న : పిల్లకేమండీ...బంగారం !

వెంకయ్య : అటూ యిటూ చూచి మరి కాలు కుంటుతుందేం ?

సుబ్బన్న : కుంటిందా ?

వెంకయ్య : కళ్ళారా చూస్తేను !

సుబ్బన్న : చూసి నన్నడుగుతారేం ?...అయినా నాకెందుకు బాబూ — పేదముండాకొడుక్కి.

వెంకయ్య : పరవాలేదు; చెప్పు సుబ్బన్నా. అంతేనా... ఇంకేమైనా లోపా లున్నాయా ? నీ పేరు బయటికి రానివ్వనుగా !

సుబ్బన్న : వీరూ మీకు మల్లేనే అడిగారు ... అబ్బాయిగారి కేమన్నా లొసుగులుంటే చెప్పమని !

వెంకయ్య : (కంగారుగా) చెప్పావా ఏవిఁటి కొంపదీసి ?

సుబ్బన్న : అబ్బాయిగారికీ ఒక కన్ను లేకపోతే నాకేం దుకూ ... ? అమ్మాయిగారికి మూతి వంకరైతే నాకేం దుకూ ? అయినా...అబ్బాయిగారి కన్ను పైకి బాగానే కనపడుతుందిగా ?

వెంకయ్య : ఆ యిబ్బంది లేదులే. నీవు మాత్రం ఎక్కడా చెప్పకు ? ఈ సంబంధం మనం చేసుకోతగ్గదేనా ?

సుబ్బన్న : సంబంధానికేం ?... చేసుకోవచ్చుగానీ ... (వింగు దాకా వెళ్ళి లోనికి చూచివచ్చాడు.)

వెంకయ్య : ఊఁ... కానీ ?

సుబ్బన్న : ఎందుకులెండి బాబూ? మళ్ళీ నా నోటికాడ కూడు పోతుంది.

వెంకయ్య : పరవాలేదు చెప్పు సుబ్బన్నా. ఒక్కమాట బయటికి పొక్కనివ్వను.

సుబ్బన్న : [దగ్గరగా వెళ్ళి] మరేం లేదుగానీ పిల్లకి రేచీకటి బాబు !

వెంకయ్య : (నిర్ఘాంతపోయి) అట్లాగా ? కళ్ళు ఆడుస్తావుంటే సిగ్గుపడింది దేమో అనుకున్నాను. సరె, సరె !

సుబ్బన్న : పెద్దోరు ! ఏంటి సుబ్బన్నా; నువ్వన్నా చెప్ప లేదంటారని చెప్పాను బాబూ. ఎక్కడన్నా అనేరు !

[లోపలనుండి కేశవరావూ ... రత్తయ్యా వచ్చారు.]

రత్తయ్య : కట్నం సంగతి పేచీయే లేదు. అయినా ... మీతో బేరమేంటి ? మీరడిగింది దియ్యటానికి, మా కేశవరావు సిద్ధమే ! తేల్చండి.

వెంకయ్య: కట్నం సంగతి నాకూ పెద్ద పట్టింపే లేదు. ఏదన్నా యిస్తే నేనాతినేది?...తినేది అమ్మాయేగా!... కానీ...

రత్తయ్య: మళ్ళీ ... ఏదో కానీ పారేశారే? ...

వెంకయ్య: మరేం లేదు. మావాడికి సంగీతం పిచ్చి!

రత్తయ్య: దానికేం? అమ్మాయి బ్రహ్మాండంగా పాడతంది! ఏఁ కేశవరావ్?

కేశవ: ఆఁ...దానికేం?...సుబ్బన్నా!

సుబ్బన్న: ఓ! (లోనికి వెళ్లాడు)

వెంకయ్య: ఆఁ...ఇప్పుడెందుకు లెండి, మీరు చెప్పారుగా? చాలు.

రత్తయ్య: చుట్టంమీద తీపి; బియ్యంమీద తీపి - అయితే ఎట్టాగండీ వెంకయ్యగారూ? ఏదో...బయటపడి, అడిగారు. మళ్లీ ఎనకాడతమెందుకు? వినాల్సిందే!

[ సుబ్బన్న...ఇందిర...వచ్చారు ]

రత్తయ్య: రామ్మా; కూర్చో ... వెంకయ్యగారు వింటా రంటగానీ ... ఒక్క పాట పాడు.

సుబ్బన్న: ఓ! ఇనే ఓపికుండాలిగానీ...ఒకటేమిటి?...వంద పాడతంది. కానీయమ్మా.

[ ఇందిర అన్నగారివైపు చూస్తుంది. ]

కేశవ: పెద్దవారు వినాలంటున్నారు. పాడమ్మా; పాడు.

పాట

ఇందిర: (అకస్మాత్తుగా ... బిగ్గరగా) కాకీ ...

[అంతా నిర్ఘాంతపోయి చూస్తారు]

కాకీ కోకిల ఒకే గూటిలో
కలిసి వసించుట ఎట్లాగో
బలవంతంగా పెండిలి చేసిన
పతితో కాపుర మట్లాగూ... ॥కాకీ॥

ఎంగిలి మెతుకులు తింటూ ప్రాణుల
హింసించే కాకాసురుడూ
చివుళ్ళు తిని జీవించే కోకిల
చెంత చేరు టది సంభవమా... ॥ కాకీ ॥

రసవంతంగా కుహూః కుహూః అని
రాగాలాపన చేస్తూ కోకిల
గానం చేసే ప్రేమ గీతిలో
భావ మేమి టే వాయసమా... ॥ కాకీ ॥

కాకి మూకలూ కోకిలమ్మనూ
కాదు కూడదని నిర్బంధిస్తే
పంచమ శృతిలో ప్రణయగాథలను
పాడుచు ప్రాణం వదలునుగా... ॥ కాకీ ॥

[ పాట యింకా అయిపోతుందనగా నే వెంకయ్య దిగ్గున లేచి నిలుచుంటాడు. సుబ్బన్న ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు. కేశవరావూ, రత్తయ్యా దిగ్భ్రాంతులై యుంటారు. పాట ముగించి ఇందిర లోనికి వెళుతుంది. ]

వెంకయ్య: అన్నీ బాగానే ఉన్నయ్! మావాళ్ల నలుగురితో సంప్రదించి, తరవాత కబురు చేస్తాను.

రత్తయ్య: అక్కడ మీ మాటకు ఎదురు చెప్పేదెవరు లెండి!

వెంకయ్య : ఎదురుచెబుతారని కాదు. అయినా...రెండు రోజుల్లో మునిగిపోయే దేముంది ?

కేశవ : దానికేం ? అలాగే కానివ్వండి.

వెంకయ్య : సెలవు !

[కేశవరావూ, రత్తయ్యా, వెంకయ్యని సాగనంపటానికి బయలు దేరారు. సుబ్బన్న వాళ్ళవైపు చూస్తున్నాడు. వాళ్ళు వెళ్ళారు. ఇందిర వచ్చింది.]

ఇందిర : ఏమయింది తాతా ?

సుబ్బన్న : ఏం గావాలో అదే అయ్యింది. అయినా నిన్నెవడు చేసుకుంటాడమ్మా !

ఇందిర : అంత వికారంగా ఉంటానా ?

సుబ్బన్న : అంతవరకైతే యిబ్బంది లేదు. కాలు కుంటి, కళ్ళు ఆరవటం; పైన రేచీకటి ! ఎట్టా దొరుకుతాడమ్మా మొగుడు ?

ఇందిర : (నవ్వి) భలే నాటకమాడావు తాతా !

[సుబ్బన్న నవ్వాడు.]

ఇందిర : పోతూ పోతూ ఏవిటో అంటున్నాడే ?

సుబ్బన్న : ఏ సంగతీ రెండురోజుల్లో కబురంపుతాడంట.

ఇందిర : (కంగారుగా) ఇంకా ఈపీడ వదల్లేదన్న మాట !

సుబ్బన్న : ఇంకొక్కటే పీడ ! రెండురోజుల్లో – అంటే, ఇక అది అంతే !

ఇందిర : నీ రుణం ఎట్లా తీర్చుకోను తాతా ?

సుబ్బన : ఇందులో నేను చేసిందేముందమ్మా...నువ్వట్లా అనుకోటానికి ?

[ మాధవరావు వచ్చాడు. ]

మాధవ : (వస్తూనే) కేశవరావ్ ! ఏం తాతా కేశవరావు ఎక్కడ !

[ ఇందిర, మాధవరావును చూచి లోనికి వెళ్ళింది. ]

సుబ్బన్న : (టేబిలుమీద గ్లాసులు తీస్తూ) ఇప్పుడే అట్లా బయటికెళ్ళారు. వస్తారు, కూర్చోండి బాబూ...

మాధవ : (కూర్చుంటూ) కూర్చోటాని కేంగానీ ... ఏవిఁటీ విశేషాలు ?

సుబ్బన్న : నాకేం తెలుసు బాబూ...ఇంత చాకిరీచేసి బతికే ముండాకొడుక్కి !

మాధవ : అదే పొరపాటు, నీవు బ్రతకడమేగాదు; ప్రపంచాన్నంతా బ్రతకిస్తూన్నావు కూడా !

సుబ్బన్న : నేనా ?

మాధవ : అవును. నీ శక్తి ఏవిఁటో నీకు తెలియదు. అదుగో, అలుచూడు ! చైనాలో...రష్యాలో...అమెరికాలో...ఇంగ్లాండులో...ఫ్రాన్సులో... ఇటలీలో...ఒకచోటేవిఁటి ? అన్ని దేశాల్లో కష్టజీవులు మేల్కొన్నారు. సర్వ విషయాలూ తెలుసుకుంటున్నారు. ఈ ప్రపంచాన్ని ఉగ్రూత లూపుతున్నారు. కానీ, నీవో ? కూపస్థమండూకంలా......అంటే, నూతిలో కప్పలా — ఇల్లే స్వర్గం...అనుకుంటున్నావు. ఈ మత్తువి వదలి కళ్ళు తెరువు !......అప్పుడు నీ కర్థమవుతుంది ? తెలిసిందా తాతా ?

సుబ్బన్న : ఉహుఁ! ఇదివరకే నయం. ఇప్పుడు మరీ అయో మయంగా ఉంది!

[ మాధవరావు నవ్వాడు. ]

కేశవ : (ప్రవేశించుతూ) ఏవిఁటి విశేషం?

మాధవ : ఆఁ ... మరేం లేదు. నేను చాలా సులభమైన శైలిలో కొన్ని ప్రపంచవిషయాలు చెప్పాను. అయినా... ఈ తాతకు అర్థంకా లేదు.

కేశవ : ఒక్కొక్కప్పుడు, నీవు చెప్పే విషయాలు నాకే అర్థంకావు. నాకేవిఁటీ? ...నీకూ అర్థంకా వేమో!

మాధవ : నాకా!!

కేశవ : అవును. కట్ట తెగిన కాలువ ఏమౌతుంది?

సుబ్బన్న : దారీ తెన్నూ లేకుండా పొలంమీద పడుతంది!

కేశవ : అంతే! (మాధవరావుతో) నీ వాగ్ధార అట్లాంటిది!

సుబ్బన్న : దారా...గీరా - నే నెరగనే! (మాధవరావుతో) ఏం బాబు! ఇన్ని మాటలు ఎక్కడ నేర్చుకున్నా?

కేశవ : నేర్చుకుంటే వస్తాయా? అతని జన్మే అట్లాంటిది?

మాధవ : సరేగానీ, నీవు ఇవ్వాళ మీటింగుకు రాలేదేం? ఎందుకని?

కేశవ : నీలాగా నన్నూ ప్రతి మీటింగుకూ హాజరు కమ్మంటే ఎట్లా? ఇనతల నాకు ఎన్ని పనులూ?

మాధవ : లక్ష పనులుంటై! ఉంటేమాత్రం?...

ఇందిర : (లోపలినుండి) తాతా!

సుబ్బన్న : ఆఁ. వస్తున్నానమ్మా. (గ్లాసులు తీసుకువెళ్ళాడు)

మాధవ: నీ సంగతి అలా ఉంచు. నీ చెల్లెలు సంగతేమిటి? ఇందిర చాలా తెలివైన పిల్ల! అరుణతో పాటు ఈమెను కూడా వర్కు చేయనిస్తే...ఎంత వృద్ధిలోకి వస్తుందో తెలుసా?

కేశవ: తెలియకేం?

మాధవ: తెలిసి, లాభం?

కేశవ: ఇందిర పెళ్ళిగాని పిల్ల!

[రత్తయ్య ప్రవేశించాడు]

మాధవ: ఏం అయితే? పెళ్ళిగాని పిల్లలు, యిల్లు కదలగూడదా? అందువల్ల వచ్చే నష్టం ఏమిటి? మా అరు...

రత్తయ్య: కావలసినంత!

మాధవ: ఏమిటది?

కేశవ: (రత్తయ్యతో) కూర్చోండి, రత్తయ్యగారూ.

రత్తయ్య: (కూర్చుంటూ, మాధవరావుతో) ఇప్పుడు ముప్పై వేలు కట్నం అడుగుతున్నారా? ఇకనప్పుడు ముప్పైకి ముప్పై - అరవై వేలు యిచ్చినా మొగుడు దొరకడు - ఈ పిల్లకి!

మాధవ: ఈ బూజుపట్టిన అభిప్రాయాలతో మా ప్రాణాలు తినేస్తున్నారు. మీకు వెనుక చూపుతప్ప ముందు చూపు లేదు! చెప్పితే వినరు!...కాలం మారింది.

రత్తయ్య: మారింది మారింది. అందుకనే ఊరికి ఉప్పలాయి వచ్చింది.

కేశవ: అదేమిటి రత్తయ్యగారూ?

రత్తయ్య : అటు పోయి చూడండి! ఏంటో మీకే తెలుస్తుంది. (మాధవరావును వ్రేలితో చూపుతూ) ఈయన అండ జూచుకుని, మా అరుణమ్మ ఆడమూకనంతా పోగుజేసి...

కేశవ : చక్కగా అల్లికపనీ, కుట్టుపనీ నేర్పుతూ ఉంది. అంతేగా ?

రత్తయ్య : అంతేనా ? ఆటలూ ... పాటలూ ... అబ్బబ్బ ! వినలేక చస్తున్నాం !

మాధవ : వింటున్నావా కేశవరావ్ ? ఆడది నవ్వగూడదు; ఏడవగూడదు; పాడగూడదు; పనిచెయ్యగూడదు ...

రత్తయ్య : ఏంటయ్యా - వీళ్ళుచేసే పని! పనంట; పని ! పనిగాదు! పిడకలు చెయ్యాలి ! !

కేశవ : అదిమాత్రం పనిగాదూ ?

మాధవ : అట్లా అడగండి.

రత్తయ్య : ఆమాటకొస్తే...అది కూడ చేతగాదు - వీళ్ళకి ! మొన్న మా అరుణమ్మ చేసిన పనిచూడు; పనిగట్టుకుని, యింటింటికి వెళ్ళి, పిల్లలకీ...తల్లులికీ నచ్చచెప్పి, వాళ్ళం దర్నీ తీసికెళ్ళి టీకాలు వేయించుతుందీ ? ఏం కొంపమునిగి పోయిందీ...ఆ పని చెయ్యకపోతే ?

మాధవ : కరెక్టు! ఆ పని చెయ్యవలసిందే! టీకాలు వేయించుకోకపోతే జనమంతా చస్తారు. ఊరు వల్లకాడవు తుంది !

రత్తయ్య : చావటమే ?...ఇక మేమంతా చచ్చామా ?

మాధవ : చావటమేగాదు. కొలుపులూ...జాతర్లూ చేసి, ఊరంతా దగ్ధయాగం చేసేవారు !

రత్తయ్య: ఏంటీ...

కేశవ: పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రమా రత్తయ్య గారూ?...మంచిని మంచిగానే చెప్పుకుందాం. టీకాలు వేయించుకోవటం మంచిదే!

రత్తయ్య: ఏంటూమంచి...ఎలమంచి! అక్కడి కెళ్ళబట్టేగా అడ్డమైనవాళ్ళచేత మాటలు పడాల్సొచ్చింది?

కేశవ: మాటలా?...మిమ్మల్నే?...ఎవడా అంది?

రత్తయ్య: వాడే! పుల్లమ్మగారి మల్లయ్యగాడుకు లేడూ?

కేశవ: ఊఁ...

రత్తయ్య: ఆ చుంచుమొఖంవాడు!

కేశవ: ఓరి గాడిద! ఏమన్నాడేవిఁటీ?...

రత్తయ్య: మొన్న టీకాలు వేయించుకోటానికి మా ఆపది కూడా వచ్చింది!

కేశవ: ఆఁ...ఆఁ...

రత్తయ్య: ఆపాటిని నేను పోయి నాలుగు కేకలువేసి, దాన్ని తీసుకువస్తున్నాను. ఈ గాడిద మా ఎనకజేరి "శాంతించు తాతా" అంటాడూ?

మాధవ: (కేశవరావుతో) ఈయన ఆర్భాటం చూచి, అలా ఉంటాడు!

కేశవ: అంతే!

రత్తయ్య: అదిగాదయ్యా సామి! వాడికి నేను తాతనా?

కేశవ: కుర్రవాడుగదూ! ఏదో అని ఉంటాడు.

మాధవ: ఎవరో కుర్రవాడు "తాతా" అన్నాడని ఈయన యింత బాధపడుతున్నాడు; పదిమంది ఎదుటా యిష్టం

వచ్చినట్లు కేకలు వేశాడుగదా - ఆమెమీద !' నిజంగా ఆ ఇల్లాలి హృదయం ఎంత బాధపడిందో !

రత్తయ్య : పదిమందిలో గనకనే అంతటితో సరిపోయింది !

మాధవ : ఇదీ వరుస !

రత్తయ్య : కాకపోతే...ఆడదానికి అలుసు యిస్తే అంకెకు వస్తుందీ ?

మాధవ : (ఆవేశంగా) ఆమెగూడా మనిషే ! మీకున్న స్వాతంత్ర్యం, ఆమెకూ ఉంది. ఆమె బలిపశువుగాదు... మీ యిష్టంవచ్చినట్టు హింసించడానికి ! అంతేగాదు...

రత్తయ్య : ఇక ఆపుబాబూ - నీ ఉపన్యాసం ! (రెండు చేతులతో నోరుమూసుకుంటూ) మూసుకున్నాగా ? (కూర్చున్నాడు)

కేశవ : (సంభాషణ మరల్చి) ఈ గొడవ సరేగానీ ... అసలు వచ్చిన పనేమిటి మాధవరావ్ ?

మాధవ : కొద్దిగా పైకం కావాలి.

కేశవ : ఏ మాత్రం ?

మాధవ : ఆఁ...ఎంతా ?...నాలుగు వందలు.

కేశవ : నాలుగు వందాలా ?...ఎందుకు ?

రత్తయ్య : ఇంకెందుకు ? తమ్ముఁడి చదువుకి !...దీని పాడుగాను, నా నోరు ఊరుకోదు !

మాధవ : అవును. కొంత వాడి పరీక్షకు ఫీజు కూడా కట్టాలి.

రత్తయ్య : అదుగో !...నేను చెప్పలా ?

కేశవ : (మాధవరావుతో) దానికేం ?...ఈ పూట గుమాస్తా లేడు. రేపు వచ్చి, కావలసిన పైకం తీసుకువెళ్ళు !

మాధవ : సరే. (లేచి రెండడుగులు వేసి) ఇదిగో... కేశవరావ్ ! ఈసారి మీటింగుకు నీవు తప్పక హాజరు కావాలిసుమా ? వస్తా.

[బయలుదేరి నాలుగు అడుగులు వేశాడు. శంకరయ్య ప్రవేశించాడు.]

శంకర : (వస్తూనే) తెలిసిందా ? తెలిసిందా ?? - రత్తయ్య మావాఁ ?

రత్తయ్య : ఏంటిరా అది ? ఏం టేంటి ?...ఏం జరిగింది ?

శంకర : అదే ! (మాధవరావును చూచి చెప్పడానికి సందేహించాడు)

కేశవ : చెప్పవయ్యా ! భయం లేదు !

శంకర : (సందేహిస్తూనే) కుట్టుపని గిట్టుపని అయ్యింది.

రత్తయ్య : ఏంటిరా నీ తలకాయ !

శంకర : (మాధవరావును చూపుతూ) ఈయన భార్య ఆడవాళ్ళం దర్నీ పోగుచేసుకుని, పొలానికి వెళ్ళింది.

మాధవ : పొలమా ?

శంకర : ఆఁ, భూషయ్యగారి వేరుసెనగ తియ్యటానికి !

కేశవ : నిజంగానా ?

శంకర : నిజంగానా - ఏంటండీ... నేను కళ్ళారా చూస్తేను.

మాధవ : నాకు చెప్పకుండా ఏపనీ చెయ్యదే ?

కేశవ : వెళితే వెళ్ళారేమో ! అబద్ధం చెప్పాలని శంకరయ్య కేంపట్టింది ?

రత్తయ్య : (కేశవరావుతో) ఇంకా అనుమానమా ? ఇయ్యాల పొలం వెళ్ళారు; రేపు బస్తీలకి ఎగబడతారు. ఇక మన ఊరివాళ్ళకి పదిమందిలో తలెత్తుకు తిరిగే ప్రేస్తం లేదు.

వీళ్లకి కూలిపనికి పోవాల్సిన గతేంబట్టిందంట ! అవ్వ ! ! అవ్వ ! ! ఇంకా చేసేదేముందీ ?

కేశవ : అంతే మరి ! ఒకదానివెనక ఒకటి ! కొండమీంది నుండి బండ జారితే మధ్యలో ఆగుతుందా ?

మాధవ : అరుణ ఎప్పుడూ అంత తెలివితక్కువ పని చెయ్యదు ! సరే, చూస్తాను... (గబగబ వెళ్తాడు)

రత్తయ్య : ఇప్పుడు తెలిసొచ్చింది - అబ్బాయికి !

శంకర : అదే; కాస్త కాక తగిలినట్టుంది !

కేశవ : నీ సంగతి నీవు చూసుకోవోయ్ ! నీ పెళ్ళాం మాత్రం వెళ్ళి ఉండదూ ?

శంకర : నా పెళ్లామా ? హుం ! ఎళితే యింకేమన్నా వుందా ? పాతెయ్యనూ ?...(రివ్వున బయటికి వెళ్తాడు.)

రత్తయ్య : వీడు అన్నంతపనీ చేస్తాడు !

కేశవ : ఆఁ, మిణికాడు !

రత్తయ్య : అట్టాగాదు; అట్టాగాదు. కాసిని పుచ్చుకున్నప్పు డల్లా నలుగు పెడతానే ఉంటాడు - దానికి !

కేశవ : సరే, పదండి - రామమందిరంవైపు వెళదాం !

రత్తయ్య : (లేచి) అవును ! అక్కడగానీ ... అన్ని కబుర్లు తెలవ్వు !

[ఇద్దరూ బయటికి వెళ్లారు. సుబ్బన్న వచ్చి, వారివైపు చూస్తూ...]

సుబ్బన్న : హుం పనిలేని మంగలాడు పిల్లితల గొరిగాడట!

[ తెర ]



# మూడో రంగం

[కామయ్యగారి యిల్లు: హాలు: అలంకరణ లోగడ మాదిరిగానే ఉంది. తెర లేచింది. కామయ్య కుర్చీమీద కూర్చొని దాశరథీ శతకం తెరచి, పురాణ ఫక్కీలో పద్యం చదువుతున్నాడు. ఆయన తెల్ల అద్దాల కళ్ళజోడు ధరించాడు. తుది చరణం చదువుతూండగా మాధవ రావు వచ్చాడు.]

మాధవ: (వస్తూనే) అరుణా! అరుణా!

కామయ్య: (పుస్తకం మూస్తూ) లోపల వంట చేసుకుంటూ ఉంది. ఎందుకు?

మాధవ: పనుంది!

కామయ్య: (వ్యంగ్యంగా) ఓహో! ఎక్కడయినా మాటింగా? తీసుకుపో. రోజూ తినే తిండేగా! ఈ పూటకు లేకపోతే మాత్రం ఏంలే...

మాధవ: అదికాదు నాన్నా! ఇవ్వాళ అరుణ...

[ఒక పిల్లవాడు కంగారుగా అక్కా! అక్కా!—అని అరుస్తూ, ఏడుస్తూ లోనికి వచ్చాడు.]

మాధవ: ఏమిట్రా... ఏమిటీ?

పిల్లాడు : అక్క ఏదీ ? అక్కా...

కామయ్య : (కళ్ళజోడు తీసి, జేబులో పెడుతూ లేచి) అమ్మాయి ! అమ్మాయి ! (వింగు దగ్గరగా వెళ్ళి లోనికి చూశాడు.)

మాధవ : ఎందుకురా అక్క ? నాతో చెప్పరాదూ ?

పిల్లాడు : (వెక్కి వెక్కి ఏడుస్తూ) మరేఁ మరేఁ ...

[ అరుణ వచ్చింది ]

పిల్లాడు : అక్కా ! (ఆమెవద్దకు పరుగున వెళ్ళాడు.)

అరుణ : ఏమిఁటి బాబూ ... ఏమిఁటి ?

పిల్లాడు : (వెక్కి వెక్కి ఏడుస్తూ) నాన్న మా అమ్మని చంపే స్తున్నాడు. రా అక్కా !

మాధవ : కొట్టడమే ?

పిల్లాడు : (అరుణతో) కాదక్కా. మరేఁ ... అమ్మనేం మీ దగ్గరికి కుట్టుపని నేర్చుకోటానికి ఎల్లొద్దన్నాడంట; అమ్మ ఏమో ఎచ్చిందంట; అందుకని...అందుకని ... రాక్కా ! (ఆమె చెయిపట్టుకు లాగాడు)

కామయ్య : దుర్మార్గుడు !

అరుణ : (భర్త ముఖంవైపు చూచింది.)

మాధవ : నేను వెళ్ళి ఆ సమస్యను పరిష్కరిస్తానుగానీ ... నీవు ఏడవకురా అబ్బాయి !

కామయ్య : (మాధరావుతో) పోరా తొందగా !

[ మాధరావు హడావుడిగా బయలుదేరి వింగువద్దకు వెళ్ళాడు. ఇంతలో శేఖర్, మరియొక యువకుడూ ... శంకరయ్యను అక్కడకు యీడ్చుకువచ్చారు. ఆ యువకుని పేరు మురళి, శేఖర్ క్లాస్‌మేట్. మురళి, కాకీ నిక్కరూ, మేజోళ్ళు, బూటు, తలకు హేట్,

కళ్ళకు నల్లద్దాల జోడూ ధరించాడు. పర్సుని నిక్కరులోపల వేశాడు. చేతిలో తోలుమూసిన చిన్నతలకాయ - బెత్తం ఉంది.]

మురళి: (శంకరయ్యతో) ఆమె మనిషనుకున్నావా? పసర మనుకున్నావా? అంతంత దెబ్బలా!!

శంకర: (వణుకుతూ) లే...లే...దండీ... ఇయ్యాల అంత దెబ్బలు కొట్టలేదండీ...

మురళి: అంటే ... ఇదివరకు, ఇంతకంటే పెద్ద దెబ్బలు కొట్టేవాడి వన్నమాట!

శంకర: ఎప్పుడూ కొట్టలేదండీ...

మురళి: ఇంతంత దెబ్బలా?

శేఖర్: ఇదిగో...ఇన్‌స్పెక్టర్ గారూ! అమాయకుడు...

మురళి: నీవు మాట్లాడకు!

మాధవ: ఓ! ఇన్‌స్పెక్టరుగారా! గుడ్‌మార్నింగ్ సార్.

మురళి: గుడ్ మార్నింగ్.

కామయ్య: దణ్ణాలండీ.

మురళి: (ప్రతి నమస్కారం చేస్తూ) పెద్దవారు. మీరు నాకు నమస్కరించడం...

కామయ్య: దానిదేవిటి లెండి...

మాధవ: (మురళితో) టూరింగు బయలుదేరా సార్!

శేఖర్: అవును. కొత్తగా అప్పాయింట్ చేశారు.

మాధవ: ఒహో! గతంలో మా ఫిర్కాకు రామంగారు! వారికీ నాకూ చాలా పరిచయం!

శేఖర్: ఇనస్పెక్టరు గారికి కాటేజీ యిండస్ట్రీస్ అంటే ఎంతో అభిమానం!

మాధవ : (మురళితో) మా గ్రామ సంక్షేమ పాఠశాల చూశారా ?

శేఖర్ : ఇంకా లేదు. అందుకే నాతో వచ్చారు.

అరుణ : అయితే వీరిని తీసుకువెళ్ళి, అవన్నీ చూపించు. అబ్బాయి ! (అరుణ లోనికి వెళ్ళింది )

మురళి : (శంకరయ్యను చూపుతూ... శేఖర్ తో) మరి...ఈయన సంగతి ?

కామయ్య : వా డెక్కడికి పోతాడు లెండి!

మాధవ : నేను ఉన్నానుగా ?

అరుణ : (ప్రవేశించి) ఇవిగో స్కూలు తాళపు చెవులు ! (శేఖర్ కు తాళపుచెవు లిచ్చి, మురళివైపు చూస్తూ) వెళ్ళిరండి !

మురళి : అట్లాగే ! (అరుణకు నమస్కరించి, శేఖర్ తో బయటికి వెళతాడు.)

శంకర : బాబూ...మాధవరావ్ ! ఎట్లాగైనా నన్ను కాపాడాలి బాబూ...

మాధవ : అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యను, ఆ విధంగా హింసిస్తావా ? ఘోరం ! దారుణం !

శంకర : (కామయ్యవైపు దీనంగా చూస్తూ) చిన్నయ్యా...

కామయ్య : నన్నేంచేయమంటావురా ?! అరేయ్ మాధవ రావ్ ! పిల్లలు గలవాడు, పాపం. ఆ యినస్పెక్టరుగారికి ఏదో నచ్చజెప్పి ...

మాధవ : ప్రయత్నిస్తాను. శక్తివంచన లేకుండా ...

అరుణ : (శంకరయ్యతో) ఏమిటి బాబాయి ... యిదంతా ?

శంకర : పొరపాటయిందమ్మా ...

అరుణ : ఏమి తప్పు చేసిందని ఆమె నింతగా హింసించావ్? మాతోపాటు అల్లికపని నేర్చుకోడానికి రావడమేనా ఆమె తప్పు? ఏం? ఆడది కష్టపడి, నాలుగు డబ్బులు సంపాదించకూడదా? నిజం చెప్పు బాబాయ్? ఇవ్వాళ మీ యింట్లో బియ్యం ఉన్నాయా?

మాధవ : ఆయనకు బియ్యం ఎందుకూ? ...తిండి ఎందుకూ!!

అరుణ : ఆయనకు అవసరం లేకపోతే సరి; మిగతావాళ్ళ సంగతి? (పిల్లవాడితో) బాబూ! ఇవ్వాళ నీవు అన్నం తిన్నావా?

పిల్లాడు : మరే... పొద్దున కాస్త సద్దన్నం ఉంటే ... నాన్న తిని వెళ్ళాడు...

అరుణ : పిల్లలూ ... తల్లీ ఉపవాసం ఉన్నారన్నమాట! బంగారం లాంటి బిడ్డలే! వీళ్ళగతి ఏంగాను బాబాయ్! బిడ్డలు. కూటికి అల్లాడిపోతూంటే, చూచి; ఏ తల్లి భరిస్తుందో చెప్పు?...

[శంకరయ్య సమాధానానికి ఎదురు చూడకుండా అరుణ వెళ్ళ డానికి సంచులోనుంచి పర్సు తీసింది.]

కామయ్య : ఆ బిడ్డల్నిచూస్తే నీకెట్టా జాలిలేదురా శంకరయ్యా?

మాధవ : జాలి! ... నిజం చెప్పు శంకరయ్యా? తప్పు చేస్తున్నావని నీ అంతరాత్మ చెబుతూ ఉందా లేదా? చెప్తూతూ ఉంది! అయినా నీవు లెక్కచెయ్యడంలేదు. అంతేగా?

అరుణ : (పర్సులోనుంచి నాలుగురూపాయలు తీసి, శంకరయ్యకు ఇస్తూ) ఈ వారంలో ఆమె చేసిన పనికి నాలుగు రూపాయలు వచ్చినై, ముందు, వీటితో బియ్యం తెచ్చి, ఇంటివద్ద యిచ్చిరండి! తర్వాత మాట్లాడవచ్చు!

[శంకరయ్య, దీనంగా అరుణవైపు చూస్తూ...ఆ పైకం అందుకున్నాడు. ఇంతలో పిల్లవాడు మెలికలు తిరిగి, చతికిల పడ్డాడు.]

అరుణ : బాబూ!!...(పిల్లవాణ్ణి పట్టుకుంది).

శంకర : ఆఁ!!!

[అరుణ పిల్లవాణ్ణి శంకరయ్యకు అందించి, గబగబా లోనికి వెళ్ళింది. కామయ్య వచ్చి, ఉత్తరీయంతో విసురుతున్నాడు.]

మాధవ : (వంగి, పిల్లవాడి ముఖంలోకి చూస్తూ) పాపం...

అరుణ : (మజ్జిగ గ్లాసుతో వచ్చి, పిల్లవాణ్ణి తన ఒడిలోనికి తీసుకుని, గ్లాసు అతని నోటి కందించి) మజ్జిగ బాబూ. తాగు.

పిల్లాడు : (రెండు గుక్కలు తాగి) కళ్ళు తిరిగినై అక్కా...

అరుణ : అలాగా?...మజ్జిగ తాగితే అదేమీ ఉండదు!... (పిల్లవాడికి మజ్జిగ తాగించడం పూర్తిచేసి, తలపైకెత్తి-శంకరయ్యను చూస్తూ)...భయంలేదు; నీవు తొందరగా వెళ్ళు బాబాయి!

శంకర : (కన్నీటితో) ఎల్తానమ్మా! బుద్దొచ్చింది. ఇట్టాంటి పాడుపని మరెన్నడూ చెయ్యను. నేను సంపాదించక పోగా...ఉన్న ఆస్తి తాగి పాడుచేశాను. పిల్లల్నీ...తల్లినీ ఈగతికి తెచ్చాను. ఆడది పని చెయ్యటం...పరువు తక్కువ - అనుకున్నాను. నీ దయవల్ల ఆ పిచ్చి వదిలి పోయింది - తల్లీ! వస్తా, వస్తానమ్మా...

[శంకరయ్య, కళ్ళు తుడుచుకుంటూ బయలుదేరాడు. సమయానికి మురళి, శేఖరులు వచ్చారు. వారిని చూచి, శంకరయ్య కొయ్యబారి పోయ్యాడు].

మురళి : (శంకరయ్యతో) ఎక్కడకయ్యా ?

[పిల్లవాడు తేరుకుని, తండ్రివద్దకు వెళ్ళాడు].

అరుణ : వెళ్ళనివ్వండి.

మాధవ : (పోజులో) ఇనస్పెక్టరుగారూ! ఆయన పూచీ నాది!

మురళి : (శంకరయ్యతో) సరే; వెళ్ళవయ్యా...

[పిల్లవాణ్ణి తీసుకుని, శంకరయ్య వెళ్ళాడు. మురళి ఆ ముగ్గురికీ నమస్కరించుతూ]

మురళి : క్షమించాలి. నేను ఇనస్పెక్టరిని కాను! మీ శేఖర్ స్నేహితుణ్ణి.

మాధవ : ఆఁ...అట్లాగా !

కామమ్మ : కానీ... కాకపోనీ! ఆ పిల్లని కాపాడటానికి దేవుడల్లే వచ్చారు.

మాధవ : ఇట్లాంటి సమయంలో అబద్ధమాడటం కరక్టే! ఎందువల్లనంటే..."ప్రాణ, విత్త, మాన రక్షణార్థమందు బొంకవచ్చు, అఘము బొంద రధిపా !" అన్నాడు— మహానుభావుడు !

మురళి : పోలీసు పేరు చెబితే హడలిపోయాడు! ఆ యిల్లాలిని కొట్టడానికి మాత్రం హీరో !

అరుణ : (నిట్టూర్చి) ఈ దురాచారం ఎప్పటికి నశిస్తుందో !

మురళి : (శేఖర్‌తో) ఏఁవిట్రా...అన్ని దెబ్బలూ తిని, ఆమె అట్లా అంటుంది ?

కామయ్య : ఏమంది బాబూ ?

శేఖర్ : శంకరయ్యగారు రంకెలువేస్తూ జుట్టుపట్టి ఆమెను బయటికి బటబట ఈడ్చుకొస్తున్నాడు. సమయానికి నేను ఆ తిన్నగా వచ్చాం. నేను వెళ్ళి, ఆమెను విడిపించటానికి ప్రయత్నించాను. కానీ...ఆ పెద్దమనిషి ఆగేటట్టున్నాడా ? నన్నుగూడా దూరంగా నెట్టిపారేశాడు. ఇదిగాదు – పని అని, మురళితో "చూడండి ఇన్‌స్పెక్టర్ గారూ" అన్నాను.

మాధవ : ఆఁ !

మురళి : ఇక చూడండి ఆయన కంగారు ! ఆమెను విడిచిపెట్టి లోపలికి పరుగెత్తాడు.

[మాధవరావు నవ్వుతాడు]

మురళి : మేము లోపలికి వెళ్ళబోయాం. కానీ, ఆమె వెళ్ళనిస్తేగా ?

కామయ్య : వెళ్ళనివ్వక ఏం జేసిందీ ?

శేఖర్ : ఏం చెయ్యాలి నాన్నా ! గడపకు అడ్డంగా నిలబడి – "అబ్బే ... ఆయన నన్నేమీ చెయ్యలేదండీ, ఆయన ఏదో కాస్త బిగ్గరగా మాట్లాడితే పిల్లలు కంగారుపడి ఏడ్చారు. అంతేనండీ, మరేం లేదండీ"...అంటుంది!

కామయ్య : పాపం, మానసతి ?

శేఖర్ : (అరుణతో) ఆమెను తప్పించుకుని లోపలికి వెళ్ళి, ఆయన్ని బయటకు తెచ్చేసరికి– మా తలప్రాణం తోకకు వచ్చిందనుకో వదినా !

మాధవ : ఆయన్ని కొట్టి, జైలుకు పంపించుతారని - ఆమె భయం!

మురళి : ఏం!-అటువంటి మనిషిని కొట్టి జైలుకు పంపితే...

అరుణ : ఆ ఆధారం కూడా లేకపోతే...ఆమె గతి ఏం కాను?

మురళి : ఉండి, ఈయన ఉద్ధరిస్తున్నాడంటారా ?

కామయ్య : మీకు తెలవను నాయనా; కూడు పెట్టినా... పెట్టకపోయినా ఆ దారి వేసు !

అరుణ : ఆయన లేకపోతే ఈ బతుకుకూడా ఉండదు.

మాధవ : పరిస్థితులు అట్లా వున్నాయి మరి !

శేఖర్ : బ్రతికడం నీ వనుకున్నంత తేలిక కాదురా బ్రదర్

మాధవ : ఇంతకూ మా పాఠశాల పూర్తిగా చూశారా ?

మురళి : చూశానండి. చాలా బాగుంది !

మాధవ : ఆc...ఏదో లెండి.

అరుణ : బీరువా తీసి, ఆ తయారైన వస్తువులూ...అవీ... చూపించావా శేఖర్ ?

మురళి : అన్నీ చూశాను. నక్క చాలా నీటుగా ఉంది. వాటిల్లో చాలాభాగం ఎగ్జిబిషన్‌కు పంపదగ్గవి !

మాధవ : నేనూ అదే ఆలోచిస్తున్నాను.

అరుణ : అంత విశేషం ఏముందిలెండి !

మురళి : అట్లా అనకండి. తప్పకుండా పంపించండి. ప్రైజు వీటికే వస్తుంది !

మాధవ : ప్రైజే కాదు. మా స్కూలుకు గ్రాంటుకూడా సంపాదించాలని చూస్తున్నాను.

శేఖర్ : మురళి ఇట్లాంటి వస్తువులను ఎంతో లైక్ చేస్తాడు. వీటినిగురించి, టౌన్‌లో ఎంత ప్రచారం చేస్తున్నాడని !

అరుణ : (మురళితో) మీకు గృహ పరిశ్రమలంటే యింత అభిమానం ఉండటం సంతోషం !

మురళి : ఇదంతా మీ కృషి ఫలితమే ననుకుంటాను !

[మాధవరావు ముఖం ముడుచుకున్నాడు.]

అరుణ : నాదేముందీ ? (మాధవరావును చూపి) అదంతా వారిది !

[ మాధవరావు ముఖం కళకళలాడింది ]

మురళి : ఆ టేబిలు క్లాత్ మీద నెమలిని అల్లారే...అది ఎంత సజీవంగా ఉంది ? ! ఎవరండీ అల్లింది ?

మాధవ : ఎవరంటే... ఆఁ... అ... అ... ఎవరు అరుణా?

అరుణ : ఇందిర.

మాధవ : ఆఁ. ఆఁ... అవును !

శేఖర్ : (మురళితో) కేశవరావుగారి సిస్టర్రా !

మురళి : ఓ... ఐ సీ...

మాధవ : ఏమిఁటీ...అతన్ని మీరు ఎరుగుదురా ?

మురళి : అవును. తరచు మా నాన్నగారి దగ్గరకు వస్తూ ఉంటారు.

శేఖర్ : వీళ్ల నాన్నగారు డీ. వై. యస్. పి. అన్నయ్యా !

మాధవ : ఓ...అట్లాగా ? చెప్పవేం ?

మురళి : సెలవిప్పిస్తారా ?

మాధవ : ఏమిఁటీ ?... అదేం పనికిరాదు. ఈ పూటకు యిక్కడవుండి, మా ఆతిథ్యాన్ని స్వీకరించి...

మురళి : క్షమించండి. ఇంటిదగ్గర చెప్పిరా లేదు.

మాధవ : అట్లాగా ?

అరుణ : అయితే ఉండండి, వస్తాను ! (లోనికి వెళ్ళింది)

[అరుణతో పాటు కామయ్య కూడా లోనికి వెళ్ళాడు]

మురళి : (శేఖర్‌తో) మీ వదిన ఇంగ్లీషు ఎంతవరకూ చదివారా ?

మాధవ : ఇంటరు చదువుతూ మానేసింది.

శేఖర్ : మా అన్నయ్య పాసయ్యారు.

[అరుణ కాఫీ తెచ్చి ముగ్గురికీ అందించింది. ముగ్గురూ కాఫీ త్రాగుతున్నారు]

మాధవ : ఇంత టాలెంటు ఉండికూడా మా అరుణ చేతులు ముడుచుకొని యింట్లో కూర్చుంటానంటుంది. నేనే ఫోర్సు చేసి, ఈ పని మొదలుపెట్టించాను.

మురళి : (కాఫీ త్రాగి గ్లాసు టేబిలుమీద పెట్టి) చాలా గొప్ప విషయం ! మీకు నా అభినందనాలు !

[మాధవరావుకు నమస్కారం చేశాడు. మాధవరావు, నవ్వుతూ ప్రతి నమస్కారం చేశాడు]

మురళి : (లేచి) సెలవిస్తారా ? (టైం చూసుకుని) యస్ ! టైం అయ్యింది. (అరుణకు నమస్కరిస్తూ) వస్తానండీ.

[అరుణ ప్రతినమస్కారం చేసింది. అతను బయల్దేరాడు. మాధవరావు, శేఖర్ - అతన్ని సాగనంపటానికి బయటికి వెళ్ళారు. మాధవరావు, మురళిని సాగనంపి, తిరిగి వచ్చేసరికి అరుణ లోనికి వెళుతూ వుంది.]

మాధవ : (వస్తూనే) అరుణా ! (ఆమె వెనుదిరిగి చూసింది) ఏవిటిదంతా ? పరువూ...ప్రతిష్ఠా ... మంచీ...చెడూ ఏదీ లేదన్నమాట !

అరుణ : ఏవిఁటండీ ?

మాధవ : ఇది చెయ్యవగిన పనీ ... ఇది తగనిపనీ - అనే విచక్షణాజ్ఞానంకూడా నీకు లేకుండా పోయింది...చివరకు! ఎందుకూ...చదువుకున్నావ్ ! తగలెయ్యనా ఆ చదువు!!

అరుణ : విషయం చెప్పకుండా ఎందు కట్టా కేకలు వేస్తారు ? అట్లాంటి పని నే నేదీ చెయ్యలేదే ?

మాధవ : ఇంకేం చెయ్యాలి ? తరతరాలనుంచి ఆర్జించిన పరువు - ప్రతిష్ఠలు గంగలో కలిపావు ! పదిమందిలో తల ఎత్తుకు తిరక్కుండా చేశావ్ !

అరుణ : మీ ధోరణి ఏవిఁటో నాకు అర్థంకావటం లేదు !

[కామయ్య వచ్చాడు]

మాధవ : కాదు, కాదు ! ఇంత బ్రతుకూ బ్రతికి, కూలిపనికి వెళతావ్ ?

అరుణ : మనకు యింకా అంత దుర్గతి పట్టలేదు !

కామయ్య : (మాధవరావుతో) కొద్దిరోజుల్లో నీ వెట్లాగూ ఆ గతి పట్టిస్తావని, ముందుగానే జాగ్రత్త పడిందేమోలే...!

మాధవ : ఇవ్వాళ కోడలుగారు వేరుశనగ తియ్యటానికి వెళ్ళింది నాన్నా !

కామయ్య : (ఆశ్చర్యంగా) ఆఁ ! ... ఏం అమ్మాయి ! నిజమేనా ?

అరుణ : వెళ్ళాను మావఁయ్యా.

కామయ్య : వేరుశనక్కాయ తీతకి ! ! !

అరుణ : అవును మావఁయ్యా.

[శేఖర్ వచ్చాడు]

కామయ్య : ఛీఛీ! ఇదంతా వినకముందే నేను చచ్చిపోతే ఎంత బాగుండేది ! (అరుణతో) ఆ వెళ్ళేముందు నాకు కాస్త విషం యిచ్చి వెళ్ళకపోయావ్ !

అరుణ : మావయ్యా...

కామయ్య : మావయ్య! మావయ్య!...చక్కగా చదువుకున్న దానివీ...గుణవంతురాలవూ అని సంతోషించాను. (మాధవరావును వ్రేలితో చూపుతూ) వీణ్ణికూడా దారికి తీసుకువస్తావని ఆశపడ్డాను. కానీ యిట్టా తయారవుతావని కల్లోకూడా అనుకోలేదు !

అరుణ : అదికాదు మావయ్యా...

కామయ్య : చాలు. పైన యింకా మాట్లాడొస్తున్నావా? బుద్ధిలేకపోతే సరి !

శేఖర్ : నాన్నా...

మాధవ : అవున్రా! తప్పు చేసినప్పుడు చీవాట్లు వెయ్యవలసిందే !

శేఖర్ : ఏవిఁటి నాన్నా! వదిన తెలియక ఏదైనా తప్పు చేస్తే తెలియ జెప్పాలిగానీ...అంత మాటా నాన్నా !! ఇంతవరకూ వదిన మనకు ఏం లోపం చేసింది నాన్నా ?

కామయ్య : నిన్ను బిడ్డలా ప్రేమించింది, నన్ను తండ్రికంటే అధికంగా చూచుకుంటుంది ! ఇంట్లో పనులు చక్కగా చేసుకుంటుంది ! అందుకు మెచ్చుకుంటాను. కానీ... ఇదేవిఁటిరా...కూలికి వెళ్లమని ఎవడు చెప్పాడంట !!

(కుర్చీమీద కూలబడ్డాడు).

మాధవ : నా బాధకూడా అదే!

అరుణ : (భర్తతో) ఈ విషయంలో మామయ్య బాధపడ్డారన్నా...కోప్పడ్డారన్నా అర్థముంది. కానీ...మీ రిట్లా మాట్లాడడం...

మాధవ : అంటే...నీవు కూలికి పోతూఉంటే, చూస్తూ ఊరుకోవాలా?

అరుణ : (మాట్లాడదు.)

మాధవ : మాట్లాడవేం?

శేఖర్ : మీరు మాట్లాడనిస్తేగా?

మాధవ : ఏమిటి రా మధ్యలో? నీకేం తెలుసనీ...

అరుణ : నేను చెప్పేది ముందు పూర్తిగా విని, తర్వాత ఏమైనా అనండి!

మాధవ : సరే; చెప్పు!–ఆ చెప్పేదేమిటో...(కూర్చున్నాడు)

అరుణ : భూషయ్యగారిది గరపచేను. అది బిగుసుకుపోతూ వుంది. ఆయనకు కూలీలు దొరకలేదు. అంతా కేశవరావుగారి పనికి వెళ్లారు. పాపం, భూషయ్యగారికి ఉన్నదే అది! పండిన పంట యీనతూ భూమిపాలయ్యేటట్లుంది!

మాధవ : పోతే పోతుంది! అందుకని...!

అరుణ : ఒకనాడు మధ్యాహ్నం పురుషు లెవ్వరూ యిళ్ల దగ్గర లేనప్పుడు, ఊరికి నిప్పు అంటుకుంది. ఆవాళ మేమే చొరవ తీసుకుని, స్టిరప్ పంపులతో ఆ మంటల నార్పివేశాం.

మాధవ : అవును. అది మంచిపని గనుక, నేనే గాదు ...
ఆవాళ గ్రామమంతా సంతోషించారు.

అరుణ : ఇదికూడ అట్లాంటిపనే గనుక, యిప్పుడూ సంతో షిస్తారనుకున్నాను.

కామయ్య : నిజమేననుకో అమ్మా...

మాధవ : నిజమే మరి; అయితేమాత్రం ?

అరుణ : (కామయ్యతో) భూషయ్యగారి భార్య, కంట తడి కూడా పెట్టింది మావయ్యా...

కామయ్య : పాపం ! కాదు మరి... (లోనికి వెళ్ళాడు)

మాధవ : అందుకని ఆ మెను ఉద్ధరించటానికి తయారయ్యావే !
ఆ వెళ్ళడంవల్ల. ఊళ్ళో ఎట్లాంటి రియాక్షన్ వస్తుందో
ఆలోచించావా మరి ?

శేఖర్ : ఆఁ... ఎంత మంచిపని చేస్తున్నా, ఊరన్న తర్వాత
ఎవరో నలుగురు ఆక్షేపించేవాళ్ళు ఆక్షేపిస్తూనే ఉంటారు.

మాధవ : మీకు ఈ మాత్రం కూడా తెలియనందుకు
ఏడవాలో... నవ్వాలో అర్థంగావడం లేదు. ఎంతమంచి
పని అయినా, ఒంటరిగా చెయ్యకూడదు. పదిమందినీ
కూడదీసుకుని చెయ్యాలి !

శేఖర్ : నిజమే అన్నయ్యా. వేరుశనగ తియ్యటానికి వెళ్ళింది
వదిన ఒక్కతే కాదుగా ?

అరుణ : చాలమంది ఉన్నాం !

మాధవ : ఉన్నారు ! అందులో నీ హోదాకు తగినవాళ్ళెంత
మంది ? నీలాంటివాళ్ళు పదిమంది వెళ్ళినప్పుడు నీవూ
వెళ్ళు. నేను కాదనను !

అరుణ : అంటే... యిప్పుడు నాతో వచ్చినవాళ్ళంతా మనకంటే తక్కువవాళ్ళని మీ అభిప్రాయం.

శేఖర్ : (వ్యంగ్యంగా)అవును; మనం చదువుకున్నాం. వాళ్ళకు చదువు లేదు. మనకు రెండెకరాలుంది. వాళ్ళకు అదీ లేదు !

మాధవ : అది కాదురా...

అరుణ : పోనీ; మీరన్నదే రైటనుకుందాం. ఎప్పుడో ఒక రోజున మనలో ఎవ్వరో ఒకరు ముందుకు రావలసిందేగా!

మాధవ : నీకు తెలియదు అరుణా ! నీకు లోకానుభవం శూన్యం ! రాజకీయంగా ... సాంఘికంగా ... ఆర్థికంగా ... ఆఁ... ఆర్థికంగా అంటే జ్ఞాపకం వచ్చింది. అరే శేఖర్ ! కేశవరావుగారి గుమాస్తా యింటిదగ్గర ఉన్నాడేమో చూచిరా !

శేఖర్ : సరే. (వెళ్ళాడు)

కామయ్య : (చుట్ట చుట్టుకుంటూ ప్రవేశించి) ఎందుకురా? డబ్బు కోసమేనా ?

అరుణ : (లోనికి వెళ్ళింది)

మాధవ : అవును. కేశవరావును ఒక నాలుగువందలు అడిగాను.

కామయ్య : నాలుగువందలా ? ఎందుకూ యిప్పుడు ?

మాధవ : శేఖర్ జీతమూ... అదీ...కట్టాలి. ఇట్లాగే...

కామయ్య : వాడి జీతం ఎంతరా ? పాతిక; ఏభై ! లేకపోతే వాణ్ణి గురించి వంద ఖర్చుపెడతావు. పెత్తనం చేతికి యిచ్చిన తర్వాత, రెండెకరాలూ కేశవరావుపాలు

చేశావు. మిగతా రెండెకరాలు కూడా తొందరగా వదిలించి వెయ్యి! పీడ వదలిపోతుంది!

మాధవ: నా స్వార్థానికి ఖర్చు పెట్టటం లేదు - ఇదంతా!

కామయ్య: అది ఉండా కొంతనయమే! మొన్న ఎవరో నాయకుడొస్తే ఆనాటి ఖర్చు యావత్తూ నీదా? విందు చేసింది కేశవరావు యింటిదగ్గరా? ఆ కేశవరావుకే నోటురాసి, డబ్బు తీసుకోవటమూ? ఇదెక్కడన్నా ఉందంటరా?

[అరుణ అగ్గిపెట్టె తెచ్చి, కామయ్యకు యిచ్చింది.]

మాధవ: మన యిల్లు తగినంత విశాలంగా లేదు. అందువల్ల అక్కడ విందు ఏర్పాటు చేశాను!

అరుణ: విందు ఎక్కడైతే ఏముంది లెండి. అట్లాంటి పనికి, ఊరి ఉమ్మడిసొమ్ము ఉందిగా - కేశవరావుగారి దగ్గర! అది ఖర్చుపెట్టకూడదూ?

మాధవ: అది ఖర్చుపెట్టే అవకాశం లేనప్పుడు ఏం జెయ్యాలి?

అరుణ: అట్లాంటి విందులకూ...సభలకూ మనం ఒక్కళ్లమే ఖర్చుపెడితే ఎన్నాళ్లు పెట్టగలం? పదిమందిదగ్గర వసూలు చెయ్యాలిగాని!

మాధవ: అందుకనే మీటింగులో అప్పీలు చేశాను అయినా...ఎవ్వరూ కానీ యివ్వలేదు. దానికి నన్నేం చెయ్యమంటావ్?

కామయ్య. ఉన్నది తగలెయ్యమంటుంది!

అరుణ: ఇంటింటికీ తిరిగి, నచ్చజెప్పి వసూలు చెయ్యాలి. అంతేగానీ...

మాధవ: ఆ బిచ్చపుపని నావల్ల కాదు!

కామయ్య: చేతగాకపోతే నేర్చుకో; ఆ రెండెకరాలు పోయి నాకు ఉపయోగపడతంది!

మాధవ: అంత అసమర్థుణ్ణి కాను! ఈ ఉన్న ఆస్తిలో నాకు చిల్లిగవ్వ అక్కర్లేదు. ఈ రోజునుంచీ కుటుంబ వ్యవహారాలన్నీ మీరే చూసుకోండి. నా బ్రతుకు నేను బ్రతకగలను!

కామయ్య: మాట్లాడితే యిదీ వరస! పది కాలాలపాటు బతికాల్సినవాళ్లురా మీరు! బాగుపడతారని చెప్పాను. వింటే విను; లేకపోతే అనుభవిస్తారు! నేనా; ఏటి ఒడ్డు చెట్టుని! నీ యిష్టం వచ్చినట్లు తగలేసుకో! (చేతిలో అగ్గిపెట్టెను విసిరి నేలకుకొట్టి బయటికి వెళ్ళాడు. మాధవరావు ఒక క్షణం చిందులు తొక్కి, కుర్చీమీద కూర్చుని, దీర్ఘంగా ఆలోచిస్తూ ఉన్నాడు. అరుణ నెమ్మదిగా భర్త దగ్గరకు వెళ్ళింది.)

అరుణ: (అనునయంగా) ఏమండీ...

మాధవ: (మాట్లాడడు)

అరుణ: మిమ్మల్నేనండి...

మాధవ: ఏవిఁటీ గొడవ! అనవసరంగా నన్ను విసిగించకు!

అరుణ: మీ నాన్నగారు ఏమాట చెప్పినా మనక్షేమానికే! పెద్దవారు; వారేదో అన్నారని యింత కోపమా?

మాధవ: ఆయన అన్నారని నేను బాధపడటంలేదు.

అరుణ : పోతే... ఈ బాధంతా నన్నుగురించేనన్న మాట ! అయితే యిక నేను గడపదాటను ! అప్పుడు వారికీ మీాకూ ఏ బాధా ఉండదు !

మాధవ : అదుగో, మళ్ళీ మొదటికి వెళ్ళావ్ ! నీవు యింట్లో కూర్చుంటే ఆ స్కూలు మూలబడుతుంది. తెలుసా ?

అరుణ : అందుకని ఏం చెయ్యమంటారు, నన్ను ?

మాధవ : నేను చెప్పినట్లు చెయ్యి. నా అనుమతి లేనిపని ఏదీ తలపెట్టకు !

అరుణ : ప్రతిదానికీ మీా అనుమతి తీసుకోవడం ఎక్కడ సాధ్యమౌతుందీ ? సమయానికి మీారు ఉంటారు; ఉండరు ! మొన్న ఊరికి నిప్పంటుకుందనుకోండి...

మాధవ : దాని దేవిటి ! అట్లాంటి సమయంలో సరే !

అరుణ : అవకాశం ఉంటే ... మీాతో సంప్రతించకుండా ఎట్లా ఉంటానండీ !

మాధవ : ఆల్ రైట్. ... (లోనికి వెళ్ళాడు. అరుణకూడా లోనికి వెళ్ళింది. బయటినుంచి భూమయ్య, కామయ్య ప్రవేశించారు)

భూమయ్య : చదువుకున్నాడూ, మనోడు, మంచోడు, న్యాయం చెపుతాడని ఒప్పుకున్నా. ఎన్నాళ్ళకీ తేల్చడేట్టాగంట ?

కామయ్య : తేల్చకపోతే ఎట్టా ? అడుగు గట్టిగా !

భూమయ్య : ఏం అడగనూ ? అడిగీ అడిగీ నోరు కాయకాసింది. కాస్త నువ్వడిగిసూడు చిన్నయ్యా !

కామయ్య : నేను ఒకటి అడిగితే, వాడు పది చెబుతాడు. వాడి సంగతి నీకు తెలిసిందేగా ?

[అరుణ వచ్చింది.]

భూమయ్య: (అరుణతో) ఉన్నాడా అమ్మా?

అరుణ: ఆఁ. ఉన్నారు!

భూమయ్య: మా పంచాయతీ సంగతి ఏంచేశాడో అడుగు దామనీ... నీకూ తెలుసుగా?

అరుణ: సరిగ్గా తెలియదు!

భూమయ్య: పడమర పొలాన కేశవరావుగారి చేను సరిహద్దున కాస్త బంజరుభూమి ఉంది!

అరుణ: ఆఁ...

భూమయ్య: అది నేను దున్నుకోబోతే ఆయన మనుషులు అడ్డంతగిలి నాగలి ఊడదీశారు!

అరుణ: బంజరు దున్నుకోవడానికి వారి అభ్యంతరం ఏమిటీ?

భూమయ్య: అదే తేల్చుకుందామని - కేశవరావు దగ్గరికి పోయాను. రగడ పెరిగింది. సమయానికి మాధవరావు కూడా అక్కడే ఉండాడు.

అరుణ: ఓహో! వీరి పంచాయితీకి మీరు ఉభయులూ అంగీకరించారన్నమాట!

భూమయ్య: అవును.

అరుణ: (కామయ్యతో) ఏం మావయ్యా! అది బంజరు భూమేగా?

కామయ్య: అవునమ్మా. ఏటా కొంచం కొంచం కలుపు కున్నాడు - కేశవరావు, తన చేలో!. ఇప్పుడు దాన్ని

యితరులు దున్నుకోవటం అంటే...పీకపట్టుకుంది - అతి గాడికి !

భూమయ్య : (అరుణతో) అంతేనమ్మా.

అరుణ : ఈ తీర్పు చెప్పటానికి ఇన్నాళ్లు తిప్పట మెందుకు మావయ్యా — ఏరిని ?

కామయ్య : ఆఁ...ఏడవలేక !

[విస్సూ లోనికి వెళతాడు]

భూమయ్య : ఎప్పు డడిగినా ఆర్థికంగా...రాజకీయంగా... ఇంకా ఏమి శ్రేంటో అంటాడు. కాస్తి...నువ్వయినా చెప్పమ్మా !

మాధవ : (ప్రవేశిస్తూ) ఏం భూమయ్యన్నా ! శేసకాయ ఏమాత్రం అవుతుంది ?

భూమయ్య : అవుతుంది పాతిక బస్తాలదాకా ! అమ్మాయి పూనుకోకపోతే ఆరుగాలం పడ్డ కష్టం అంతా నేల కలిసి పోయేదే ! మనవాళ్ళు చేలోకొస్తే, పీళ్ళ దుంప తెగ - పీళ్ళవల్ల ఏమవుతుం దనుకున్నా. కానీ...అమ్మాయి వాళ్లచేత ఎంత పని చేయించిందీ...ఎంత పని చేయించిందీ !! అసలు అమ్మాయి మాటల్లోనే ఉంది — ఆ వుశారు !

మాధవ : మొట్టమొదట యింట్లోనుంచి కదిలి లేది కాదు. ఎన్నెన్ని విషయాలు మారిపోస్తే అక్కడికి డెనలపి అయ్యింది !

భూషయ్య : నువ్వు ఎంతజెపితే ఏ మవుతుంది!- అమ్మాయి తెలివి తక్కువదైతే!...సరేగానీ, ఆ పంచాయితీ సంగతి యిక అంతేనా ?

మాధవ : చెపుతాను, చెపుతాను! చెప్పాలంటే ఎన్ని విషయాలు ఆలోచించాలి? సాంఘికంగా...ఆర్థికంగా...

భూషయ్య : రాజకీయంగా బోలెడన్ని ఆలోచించాలంటావు; అంతేగదా !

మాధవ : అవును; తొందరపడితే ఎట్లా భూషయ్యన్నా ?

భూషయ్య : నేను తొందరపడేవాణ్ణి అయితే, ఈ పాటికే గున్నిపై రేసేవాణ్ణి! నువు జెప్పినట్లు వింటానన్నాను కాబట్టే ఆ మాటకి కట్టుబడి ఉండా! ఇక ఆగటానికి వీల్లేదు. తరుణం నెత్తిమీదికొచ్చింది!

అరుణ : ఎందుకండీ పెద్దవారి నలా తిప్పడం? ఎదోఒకటి తేల్చెయ్యరాదూ ?

మాధవ : అది అంత తేలిక పనిగాదు. ఇట్లాటి విషయాల్లో బహుజాగ్రత్తగా ఉండాలి. లేకపోతే ఎన్ని చిక్కులు వస్తాయో మీ ఆడవాళ్ళకేం తెలుస్తుంది? కనుక...

భూషయ్య : చచ్చాంరా బాబూ! మళ్ళీ మొదలయింది పురాణం! వినవమ్మా; విను!

అరుణ : (భర్తతో) అది బంజరు! గవర్నమెంటు దున్నుకోమంది. ఇందులో పెద్ద చిక్కు ఏవిటండీ?... కాస్త వివరంగా చెప్పండి !

మాధవ : చిక్కేవిటంటే...

భూమయ్య : ఇక నువ్వు చెప్పుతావ్ ! వినేవాళ్ళకి మాకు ఓపిక ఉండొద్దూ ?

అరుణ : (నవ్వి) చెప్పనివ్వండి. (మాధవరావుతో) ఇంతకీ కేశవ రావుగారి వాదన ఏవిఁటి ? ఏం అంటాడాయన ?

మాధవ : అది బంజరుగా ఉండకపోతే తన పశువులకి యిబ్బంది - అంటాడు. అదీ ఆలోచించాల్సిన విషయమే !

అరుణ : అవును; పాపం ! పేదరైతు ! ఆయనకు యిక వేరే భూములు లేవుగదూ...పశువులు నిలవడానికి ?

భూమయ్య : అడుగమ్మా; అడుగు. అట్టా అడుగు !

అరుణ : మనలో మాట ! (భూమయ్యను చూపుతూ) వీరు ఆ భూమిని దున్నుకోవడం న్యాయమేగా ?

మాధవ : అందులో సందేహం లేదనుకో...

అరుణ : ఆ మాటే చెప్పివేయండి !

[కేశవరావు వచ్చాడు.]

భూమయ్య : అదుగో; సమయానికి ఆయనకూడా వచ్చాడు.

మాధవ : (చూచి) ఓ ! కేశవరావా ? రా, కూర్చో రావోయి !

కామయ్య : (లోపలినుండి) అమ్మాయ్ !

అరుణ : ఆఁ...వస్తున్నాను మావయ్యా. (లోనికి వెళ్ళింది.)

మాధవ : (కేశవరావుతో) అదే...మీ పంచాయతీ గొడవ !

కేశవ : ఊఁ ... (ఇంటిని పరిశీలిస్తూ) సరేగానీ ... ఏవిఁటీ - ఈ యిల్లూ...ఈ రూమూను ? నాకేం బాగుండ లేదు.

[కూర్చుంటాడు]

మాధవ : అంటే ?

కేశవ: ఎప్పుడూ పదిమంది వచ్చిపోయే కొంప! నీటుగా ఉండాలి. ఇదుగో; ఈ గోడ పడగొట్టించి. రెండు పెద్ద కిటికీలు పెట్టించు. మంచి అందమొస్తుంది! ఇంటికి ... గాలీ, వెలుతురూ కావలసినంత వస్తుంది!

మాధవ: పెట్టించాలంటే...

భూషయ్య: ఓపికుండొద్దూ? బాగుకు మిత మెక్కడ?

మాధవ: అదే!

కేశవ: డబ్బు సంగతా? కావాలంటే నాలుగైదు వందలు తీసుకో! నీవు ఎప్పుడడిగితే కాదన్నాను?

మాధవ: కాదంటావని కాదు. ఇదివరకే నీకు చాలా యివ్వాలి...

భూషయ్య: మీరు తరవాత మాట్టాడుకోవచ్చు. ముందు నా పంచాయతీ సంగతి తేల్చండి. నాకు అవతల బోలె డంతపని ఉంది!

కేశవ: మేమేనా అంత పనీపాటా లేనివాళ్ళం?

భూషయ్య: మీ పనులు వేరు. మీతో నాకు పోటీయా?

కామయ్య: (ప్రవేశించి) ఇదిగో కేశవరావ్! నీ ఎత్తుకు నీకు యీ భూషయ్యతో తగాదా ఏంటి? నాకేం బాగుండలా!

కేశవ: ఏంజేస్తాం కామయ్యగారూ? పట్టుదలవస్తే అంతే మరి!

కామయ్య: (కొంచెం నవ్వి) పట్టుదల. పిచ్చుకమీదనా బ్రహ్మాస్త్రం?

కేశవ: అందుకే మనవాడి పంచాయతీకి అంగీకరించాను.

కామయ్య : ఈ భాగ్యానికి పంచాయతీయా ? ఆ మాటేదో నీవే చెప్పేస్తే పోలా ?

కేశవ : అదెట్లా ? పంచాయతీ అన్న తరువాత పంచాయతీయే !

కామయ్య : సరే, నీ యిష్టం. (బయటికి వెళ్ళాడు)

మాధవ : తరుణాం నెత్తిమీదకు వచ్చిందంటున్నాడు. భూమయ్యన్న !

కేశవ : దాని కేమిటిగానీ ... మనం ఊరికి ఎప్పుడు వెళ తామో తెలుసుకుందామని వచ్చాను. (టైం చూచుకుని) అరె ! ఆరయ్యిందే ? పొరుగూరి పెద్దమనిషి ఒకరు నాకోసం వస్తారు !

మాధవ : అయితే, ఆ పని చూడండి. ఉన్న ఊళ్లో పని; ఇది రేపు చూసుకోవచ్చు !

[ అరుణ వచ్చింది ]

భూమయ్య : పొద్దుగూకి వచ్చిన పొరుగూరి పెద్దమనిషి, ఇప్పు డెక్కడికి పోతాడు ? ఏదో ఒకటి తేల్చండి.

కేశవ : తేల్చడానికి యిదేమీ నిమిషాలమీద అయ్యే పని కాదు !

అరుణ : కాకపోవటానికి యిందులో ఉన్న చిక్కు ఏమిటండీ కేశవరావుగారూ ?

కేశవ : ఒక టేమిటీ ? లక్ష !

అరుణ : ఈ తగాదా భూమి బంజరా... లేక మీ సొంతమా?

కేశవ : బంజరే !

అరుణ : అయినప్పుడు మీరు రాభూమిని దున్నుకోకుండా అభ్యంతర పెట్టడం న్యాయంకాదు.

కేశవ : (మాధవరావును చూపుతూ) ఆ విషయమే చెప్పమను !

అరుణ : ఇది వారి అభిప్రాయమే !

కేశవ : ఏం మాధవరావ్ ?

మాధవ : ఎందుకుగాని కేశవరావ్...పోనియ్ వెధవగొడవ ! భూమయ్యగారూ ! వెళ్ళి దున్నుకోండి.

కేశవ : (వ్యంగ్యంగా) ఆ మాటన్నావ్ ! బాగుంది ! సరే; వస్తా !

[ వెళ్ళాడు ]

భూమయ్య : (నిట్టూర్చి అరుణతో) నీ పుణ్యాన బతికి, బయట పడ్డానమ్మా ! (మాధవరావువైపు తిరిగి) వెళతానయ్యా ! (వెళ్ళాడు)

మాధవ : (అరుణమీద మండిపడుతూ) నీకు బుద్ధిఉందా ? ఏమిటి నీవు చేసిన పని ? లీడరు నయ్యాననుకొంటూన్నావా ?

అరుణ : ఎందుకండీ అంతంత పెద్దమాటలు ?

[కామయ్య వచ్చాడు]

మాధవ : మళ్ళీ మాట్లాడతావ్ ! పశువా ! విశ్వప్రయత్నం చేసి ఆ కేశవరావును యిప్పుడిప్పుడే దారికి లాక్కొస్తు న్నాను. పనిగట్టుకుని నా ప్రయత్నమంతా భగ్నం చేశావు ! సర్వనాశనానికి కారకురాలవయ్యావ్ ! ఈ మాత్రం తీర్పు చెప్పలేక నేనా నేను ఊరుకుంది ? అతనికి మూడు వేలు యివ్వాలి ! ఆ నోటు ప్లయింటు చేశాడంటే ఉన్న రెండెకరాలూ ఊడిపోతుంది ! తరవాత గడ్డి కర వాలి ! తెలుసా ?

అరుణ: అలా అనుకుంటే మీ రీ పంచాయతీ చెప్పటానికి అంగీకరించనే కూడదు, అంతేగానీ...

మాధవ: (విసురుగా) అరుణా! కట్టిపెట్టు నీవాగుడు!

అరుణ: క్షమించండి! (లోనికి వెళుతూ ఉంది)

మాధవ: మీ ఆడబుద్ధి పోనిచ్చావుగాదు! అసలు... నిన్నొక మనిషిగా తయారుచేసి, నీకు స్వాతంత్ర్యం యివ్వడమే తప్పయింది!

కామయ్య: ఆ ఏడుపు యిప్పు డేడుస్తా వెందుకూ?

మాధవ: నాన్నా! ఏమిటి మీరనేది!

కామయ్య: లేకపోతే ఏమిట్రా యిది!

మాధవ: ఛీ!

[రివ్వున బయటికి పోయాడు. కామయ్య కుమారునివైపు చూస్తూ నిలచిపోయాడు.]

[తెర]

# నాలుగో రంగం

[కేశవరావుగారి యిల్లు. అలంకరణ రెండవ రంగం మాదిరే. ఇందిర జడవేసుకోడం పూర్తిచేసి, రిబ్బను ముడివేసుకుంటూ ఉండగా తెరలేస్తుంది. ఆమె, టేబులుమీది దువ్వెన అందుకుని, అద్దానికి ఎదురుగా నిలచి, కూనిరాగాలు తీస్తూ కురులు సరిచేసుకుంది. తరువాత ముఖాన తిలకం దిద్ది, గులాబిపువ్వు జడలో ధరించింది.]

సుబ్బన్న : (లోపలినుంచి వచ్చి) ఎక్కడికమ్మా... ముస్తాబవుతున్నావ్ ?

ఇందిర : ఇవ్వాళ తొందరగా మన గ్రామ సంక్షేమ పాఠశాలకు వెళ్లాలి. అక్కడ మేము పిల్లలకు పాటలు... డాన్సు...చిన్ననాటకం నేర్పుతున్నాం !

సుబ్బన్న : అట్లాగా ?

ఇందిర : కొద్దిరోజుల్లో ప్రదర్శించబోతున్నాం కూడా !

సుబ్బన్న : ఆఁ, అవాళ నన్నుకూడా తీసుకెళతావా అమ్మా !

ఇందిర : నీవు లేకుండానా ? అవన్నీ నీవు తప్పకుండా చూడాలి.

సుబ్బన్న : మరి...నువ్వుకూడా ఏసం కడతన్నావా ?

ఇందిర : లేదు తాతా.

సుబ్బన్న : వద్దులే అమ్మా. అసలు నువ్వు అక్కడి కెల్లు స్నందుకే మీ అన్నయ్య కొరకొరలాడతన్నాడు.

ఇందిర : ఆయన ఎప్పుడూ అంతే !

[ పిల్లవాడు వచ్చాడు ]

ఇందిర : రా; రా బాబూ. ఏవిటీ యిట్లా వచ్చావ్ ?

పిల్లాడు : నీకోసమే. నిన్నా... మొన్నా రాలేదేంటి అక్కా ?

ఇందిర : వస్తూన్నానుగా యిప్పుడు !

పిల్లాడు : ఎప్పుడమ్మా మా కా పాటలన్నీ వచ్చేది ?

సుబ్బన్న : ఓ! పంతులమ్మగారా ఏంటి ఈమె ?

పిల్లాడు : ఇదుగో తాతా! (వేలు చూపుతూ) పంతులమ్మ గారు ... గింతులమ్మగారూ అన్నావంటేనా ? ... అక్క !

సుబ్బన్న : (నవ్వి) ఇంతకూ అక్క నీకు ఎన్ని పాటలు నేర్పింది ?

పిల్లాడు : ఒకటి.

ఇందిర : పాడరా బాబూ; తాత వింటాడు.

పిల్లాడు : నేను పాడను !

సుబ్బన్న : అసలు వస్తేగా పాడటానికి ?

పిల్లాడు : రాదేం ?

సుబ్బన్న : పాట నీకు రాకేం ?

[పిల్లవాడు అపస్వరంలో పాట అందుకున్నాడు.]

ఇందిర : తప్పు! అట్లాగాదు.

పిల్లాడు : మరింకెట్లా ?

[ఇందిర పాడడం ప్రారంభించింది. తాత తన్మయుడై వింటున్నాడు. పిల్లవాడు, పాటను తానుకూడా అందుకోవడానికి ప్రయత్నించు తూన్నాడు. పాట పూర్తయ్యింది.]

పాట

బాల బాలికలమూ
రేపటి పౌరులమూ
భారత భాగ్య విధాతలమూ
అధినేతలమూ ॥బాల॥

చదువూ సాముా నేర్చేసి
శాస్త్రాలన్నీ చదివేసి
శ్రద్ధపూని పనులన్నీ చేస్తాం
సకల సంపదలు పెంచేస్తాం ॥బాల॥

మోసం ద్వేషం చంపేసి
ఆశాపాశం తెంచేసి
దు - రాశా పాశం తెంచేసి
కొందరికుండే సుఖసంపదలూ
అందరు పొందేలా చేస్తాం ॥బాల॥

కులతత్వాలను ఖండించి
కళలన్నిటనీ పోషించి
నూతన యుగమును నిర్మిస్తాం
భూతల స్వర్గం సృష్టిస్తాం. ॥బాల॥

సుబ్బన్న : బాగుంది. (పిల్లవానితో) అట్టాపాడాలి నాయనా!
పిల్లాడు : ఒక్కసారేగా అమ్మా...నాకు నేర్పింది?
ఇందిర : ఇవ్వాళ యాభైసార్లు నేర్పుతాను. వెళ్లి, మనవాళ్ల సందర్శి పోగుచెయ్యి!

పిల్లాడు : తొందరగా వస్తావా మరి ?

ఇందిర : యిప్పుడు రానూ !

[పిల్లవాడు రివ్వున పరుగెత్తాడు. ఇందిర, దువ్వెన, అద్దమూ సుబ్బన్నకు అందించి, పాఠశాలకు బయలుదేరింది.]

సుబ్బన్న : పన్నెండుగంటలదాకా అక్కడే కూచునేవ్ !! మళ్లీ మీా అన్నయ్య వచ్చాడంటే...

ఇందిర : తొందరగానే వస్తాలే ...

[సుబ్బన్న లోనికి వెళ్లాడు. ఇందిర వింగువరకూ వెళ్లి, వెనుదిరిగివచ్చి, టేబిలుమీద ఉన్న "ముత్యాలసరాలు" అనే పుస్తకం అందుకుని బయలుదేరింది. ఇంతలో కేశవరావు వచ్చాడు.]

కేశవ : ఎక్కడికమ్మా ? గ్రామ సంక్షేమ పాఠశాలకా ?

ఇందిర : అవును.

కేశవ : వెళ్ళడానికి వీల్లేదు.

ఇందిర : అదేవిఁటి అన్నయ్యా ?

కేశవ : అంతే !

ఇందిర : అక్కడ పిల్లలు నాకోసం ఎదురుచూస్తూ ఉంటారు !

కేశవ : ఎందుకు ?

ఇందిర : వాళ్ళకు పాటలు నేర్పుతున్నాను.

కేశవ : (వెకిలిగా నవ్వి) పూటకూటికి గతిలేని వెధవలకు పాటలు !!

ఇందిర : కూటికి లేకపోతే పాటలు నేర్చుకోకూడదా ?

కేశవ : వాళ్ళబొంద ! వాళ్ళకు పాటలేవిఁటి ? నీ హోదాకూ నీ స్థితికి...నీవు వెళ్లి ఆ కూలిగుంపుమధ్య తిరుగుతావ్ ? సిగ్గులేదూ ?

ఇందిర (జాలిగా) నేను నేర్చుకొనే అల్లిక పనికూడా చెడి పోతుంది అన్నయ్యా...

కేశవ : హుఁ! అల్లికపని! అది నేర్చుకోకపోతే నీకుజరగదా? అంత నేర్చుకోవాలని ఉంటే... ఆ నేర్పేవాళ్ళను యిక్కడకే రమ్మను. డబ్బు పారేస్తాను !

ఇందిర : అరుణ అక్కాయినా ?

కేశవ : ఏం ? ఆవిడ స్వర్గంనుంచి ఊడిపడిందా ? ఊరినంతా సర్వనాశనం చేసింది ! ఇప్పుడు మన యింటికి కూడా నిప్పుపెట్టాలని చూస్తోంది !

ఇందిర : (ఆశ్చర్యంగా) అరుణక్కాయా ?

కేశవ : అవును. నిన్ను మాయజేసి, నీకూ, ఆ శేఖర్‌గాడికీ పెండ్లి చేయాలని ప్రయత్నించుతోంది !

ఇందిర : ఆమె అట్లాంటి ప్రయత్నం ఎన్నడూ చెయ్యలేదు. చెయ్యదు !

కేశవ : ఆవిడమాట అలా ఉంచు. నీ మనస్సులో ఉంది కదూ ? —— వాణ్ణి చేసుకోవాలని ?

[ఇందిర మాట్లాడదు]

కేశవ : వాడు నిన్ను పెళ్లి చేసుకోవడానికి కాదు; నీవైపు తేరి చూడడానికి కూడా అనర్హుడు ! నీకోసం ఎంతెంత గొప్ప సంబంధాలు వస్తున్నవో తెలుసా ?

ఇందిర : వచ్చిందిగా మొన్న ఒక సంబంధం ?

కేశవ : దానికేం ? అది కుదిరితే అంతకంటే అదృష్టం యింకేంఉంటుంది ? ఈ శేఖర్‌గాడు ఆ కుర్రవాడి బూట్లు తుడవడానికి కూడా పనికిరాడు !

ఇందిర : ఏదీ ... ఆ ఒంటికంటి ఘర్షఘోరం గ్రాడ్యుయేట్ బూట్లా?

కేశవ : (మండిపడుతూ - బిగ్గరగా) ఇందిరా! (ఇందిర లోనికి వెళుతూ వుంది.) ఈ తలతిక్క వేషాలు కట్టిపెట్టి, నోరు మూసుకుని పడి ఉండు. ఈరోజు మొదలు గడప దాటా వంటే ... చీల్చేస్తాను! జాగ్రత్త!!

[ఇందిర లోనికి వెళ్ళింది. కేశవరావు రోజుతూ కుర్చీమీద కూలబడ్డాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. తరువాత సుబ్బన్న మెల్లగా వచ్చాడు.]

సుబ్బన్న : తల్లీ లేదు; తండ్రీ లేదు; అమ్మాయికి తల్లైనా, తండ్రైనా ... అన్నైనా నీవేగా బాబూ?

కేశవ : అట్లని జాలి తలవబట్టే ... యిట్లా తయారైంది!

సుబ్బన్న : ఉసూరుమని ఏడుస్తా ఉంది ...

కేశవ : (నిట్టూర్చి) వెళ్ళి ఓదార్చి, యికను ఎప్పుడూ బయటికి వెళ్ళవద్దని చెప్పు!

సుబ్బన్న : వద్దంటే ఎందుకు ఎల్తుంది బాబూ? అమ్మాయి ఏమన్నా తెలివితక్కువదా ...?

కేశవ : తెలివి తెల్లవారినట్లే ఉంది. వెళ్ళి, ముందు ఓదార్చు. వెళ్ళు!

[సుబ్బన్న వెళ్ళాడు. ఇంతలో రత్తయ్య వచ్చాడు.]

రత్తయ్య : (వస్తూనే) అరెరెరెరె! ఆ బూమయ్యని పట్టించుగ్గా లేకుండా ఉండయ్యా! మీసా లేం దువ్వుతున్నాడు. ఏం దువ్వుతున్నాడూ?...

కేశవ: (విషపు నవ్వు నవ్వి) దువ్వుతాడు, దువ్వుతాడు! ఇల్లు అలకగానే పండగ అవుతుందా రత్తయ్యగారూ?

రత్తయ్య: అదంతా తరవాతసంగతి! ఇంతకీ మావాడికేం తెగులు వచ్చిందంటా! ఇట్టా తీర్పు చెప్పాడు?

కేశవ: అతనికి అది న్యాయంగా తోచిందేమో మరి!

రత్తయ్య: ఏంటా న్యాయం? ఇవతల కాలు నొచ్చినా... వేలునొచ్చినా! డబ్బూ దసకం యిచ్చి, ఆదుకునేది నువ్వా; ఆ బూషియ్య ఏం ఆదుకుంటాడూ...గోంగూర!! బుర్రఉండాడు, ఎవ్వడూ ఈపని చెయ్యడు! ఊరికే వాగ మంటే వాగుతాడు, వసబోసిన పిట్టకిమల్లే!

కేశవ: అతన్ని అనీ లాభం ఏవీటిలెండి! చేసినదంతా మీ అరుణ!

రత్తయ్య: అదుగో, ఆ మాట అంటేనే నేను ఒప్పుకోను! అసలు మొగాడిదగ్గర దమ్ముంటే – ఆడదేం చేస్తుందంట!

కేశవ: అదీ నిజమేననుకోండి; కానీ...

రత్తయ్య: కానీ లేదు; అర్ధణా లేదు. అది అంతే! ఆయిగా యింటో తిని, ఇంటో కూచుని సంసారం దిద్దుకునే పిల్లని, ఈ తీరు చేశాడు! నువ్వు మంచాడివి గనక సరిపోయింది. ఈ కోపంమీద నీ కియ్యాలిసిన మూడు వేలూ కక్క మంటే ఏమవుతాడు?

కేశవ: అడుక్కుతింటూ పోతాడు!

రత్తయ్య: ఆ పనిమాత్రం చెయ్యబోకు బాబూ! సరేగాని... ఇంతకీ వచ్చినపని మరిచిపోయి కూర్చున్నా. ఈ పూట అమ్మాయిని కాస్తి మా యింటికి పంపాలి!

కేశవ : ఎందుకూ ?

రత్తయ్య : ఆఁ...ఏం లేదు. (లజ్జగా) ఇయ్యాల మా యింట్లో సీమంతం...

కేశవ : ఓ...అదా సంగతి ! చెప్పారుకాదు ?...అయినా మీరు పిలవడం ఏవిఁటీ ?

రత్తయ్య : తతిమ్మాచోట, ఎవరో పేరంటవాళ్ళు పిలుస్తున్నారు. మనింటికి నేనే స్వయంగా వచ్చా !...అమ్మాయిని దగ్గరుండి తీసుకెళదామని !

కేశవ : సరే, దాని దేవిఁటీ ? మీ ఇంటికి పంపడానికేం !... తప్పకుండా వస్తుంది. (లోనికి చూస్తూ) సుబ్బన్నా ! (సుబ్బన్న వచ్చాడు. అతనితో) మన రత్తయ్యగారింట్లో సీమంతమట. అక్కడికి ఏం తీసుకెళ్ళాలో మనకు తెలియదు. సరే...అవన్నీ తీసుకుని అమ్మాయిని బయలుదేరమను !

సుబ్బన్న : సరే బాబూ !

కేశవ : (పర్సులో నుంచి పదిరూపాయల నోటు తీసి) ఇదుగో సుబ్బన్నా ! ఈ పది రూపాయలూ అమ్మాయి కివ్వు; దగ్గర ఉంచుకోమని చెప్పు !

[నోటు తీసుకుని సుబ్బన్న వెళ్ళాడు]

రత్తయ్య : అయ్యిందేదో అయ్యింది. ఆ నోటు మాత్రం ప్లయింటు చెయ్యకు బాబు !

కేశవ : చెయ్యవద్దనే ఉంది ! నాకు అతనిమీద ఉన్న అభిమానం అట్లాంటిది.

రత్తయ్య: ఇట్టాంటి స్నేహితుణ్ణి పోగొట్టుకున్నాడంటే... ఊహుఁ!!

కేశవ: నేను ఎంత మేలు దలచినా అతను బాగుపడేది లేదు! ఆ ఉన్న రెండెకరాలూ కూడ తమ్ముడి చదువు కనీ ... దానికనీ ... దీనికనీ తగలేస్తాడు! అందువల్ల ప్లయింటు చెయ్యడమే మంచిదేమో అనిపిస్తోంది – మళ్ళీ!

రత్తయ్య: ఇంతకీ అతగాడు బాగుపడేదారి లేదంటావా?

కేశవ: ఎందుకు లేదు?! ఉంది మరి, మీరు పూనుకుంటే!

రత్తయ్య: వాళ్లు బాగుపడాలిగానీ...మీరేది చెయ్యమంటే అది చెయ్యనూ?!

కేశవ: వాళ్ళంటే మీకు ఎంత ప్రేమండీ...?

రత్తయ్య: శాస్త్రి చుట్టరికం ఏడిసిందిగా? అందులో అరుణ అంటే మా ఆడది పడిచస్తుంది! ఆ పిల్ల యిబ్బంది పడతా వుంటే ... ముఃదు దీని పేణం పోతంది!

కేశవ: అట్లాగా! ఈమె బాధపడుతూఉంటే మీరు చూడ లేరు. అదా సంగతి? (నవ్వుతాడు)

రత్తయ్య: సరే; దానిదేంటిగానీ ... ఇంతకీ నేను చెయ్యా లిసిందేంటో చెప్పావుగాదు!

కేశవ: తరువాత చెప్పుతాను. తొందరపడితే ఎట్లా?

రత్తయ్య: సరే.

కేశవ: ఆ వెంకయ్యగారి సంబంధం సంగతి మీ కేమైనా తెలిసిందా? రెండు రోజుల్లో తెలియ పరుస్తానన్నాడు; ఇంతవరకూ ఏ కబురూ లేదు.

రత్తయ్య : ఇయ్యాలా ... రేపూ చూసి, తరవాత నేనే పోయి తాడో ... పేడో తేల్చుకుంటా ! తప్పేంటి ?

కేశవ : సరే.

రత్తయ్య : అవతల నాకు...

కేశవ : సుబ్బన్నా !

సుబ్బన్న : బాబూ ! (వచ్చాడు)

కేశవ : ఏవిఁటీ ఆలస్యం ?

సుబ్బన్న : ఏంలేదు బాబూ ! మీరేదో మాట్లాడతారని చూస్తున్నా ! (లోనికిచూస్తూ) రామ్మా; పెద్దమనిషి పని మాలావచ్చాడు; రా అమ్మా !

[ఇందిర సిల్కుచీర ధరించివచ్చింది. ఆమెచేతిలో పళ్లెంవుంది. పళ్లెంలో పసుపు... కుంకుమ... అవసరమైన యితర సామగ్రులూ ఉన్నాయి. ముందు రత్తయ్యా... వెనక ఇందిరా - వెళుతున్నారు]

కేశవ : రత్తయ్యగారూ ! (రత్తయ్య వెనకకు తిరిగాడు) అమ్మాయిని తొందరగా పంపించండి.

రత్తయ్య : ఓ. (రత్తయ్యా, ఇందిరా బయటకు వెళ్ళారు)

కేశవ : సుబ్బన్నా !

సుబ్బన్న : బాబూ ?

కేశవ : ఆ వెంకయ్యగారి సంబంధం మంచిదేనంటావా ?

సుబ్బన్న : సంబంధానికేం బాబూ ?... బోలెడంత డబ్బు ఉంది, ఎంతఉంటేం... మన దర్జాముందు ?

కేశవ : దార్జాకేం మొచ్చెలే !

సుబ్బన్న : అంతేలే బాబూ.

కేశవ : కుర్రవాడికి కన్ను ఒకటి లేదని విన్నానూ...

సుబ్బన్న : నిజంగానా ? నేనక్కడుండగా అదేంలేదే ?...
అదేదో సరిగ్గా తెలుసుకోండి బాబూ !
కేశవ : ఊఁ...

[ఇంతలో అరుణ వచ్చింది]

కేశవ : (అరుణతో) కూర్చో అరుణా !
అరుణ : ఇందిర ఏదీ తాతా ?
సుబ్బన్న : లేదమ్మా-
అరుణ : ఊఁ...ఎక్కడకు వెళ్ళింది ?
కేశవ : పిల్లలకు పాటాలు నేర్పాలంటూ బయలుదేరింది; ఇంతలో రత్తయ్యగారొచ్చి, గొడవపెడితే వారింటికి పంపించాను.
అరుణ : అట్లాగా... (వెనుకకు తిరిగింది)
కేశవ : కూర్చో అరుణా; పిలిపిస్తాను ! సుబ్బన్నా !
అరుణ : అహ ! అక్కర్లేదు. నేనూ అక్కడికే వెళ్ళాలి.

[బయిలుదేరింది]

కేశవ : అరుణా ! ఒక్కవిషయం; కూర్చో...
అరుణ : (ఆగి) పరవాలేదు. చెప్పండి !
కేశవ : ఆఁ...మరేంలేదు. ఇందిర వివాహం సంగతి నీతో సంప్రదించుదామని... ! కూర్చో అరుణా !
అరుణ : (కూర్చుంటూ) ఏదైనా సంబంధం వచ్చిందా ?
కేశవ : ఒకటేమిటి ?! అనేకం. వస్తున్నారు; పోతున్నారు ! ఎంతమంచి సంబంధం తెచ్చినా, ఇందిరకు నచ్చడంలేదు. కారణం తెలియదు !
అరుణ : అడిగి చూడకపోయారా ?

కేశవ: అదే ... అడుగుతున్నాను, తప్పకుండా నీకు తెలిసే ఉంటుందని!

అరుణ: దాని దేవిఁటి! తెలియకపోతే తెలుసుకోవచ్చు. అసలు, మీరు ఇందిర కోరికప్రకారం వివాహం చెయ్యడానికి అంగీకరిస్తారా?

కేశవ: ఎందు కంగీకరించనూ ... అన్నివిధాలా తగిన సంబంధమైతే?

అరుణ: ఆ స్త్రీపాస్తులుకూడా మీతోపాటు ఉండాలంటారు?

కేశవ: అవును! లేకపోతే ఎట్లా? చిన్నతనం; తెలియక ఎవడో పేదవాణ్ణి ఒకణ్ణి ప్రేమించానంటుంది. చెయ్యదగ మేనా?

అరుణ: అయితే ... ఇందిర అభిప్రాయం తెలుసుకోవడ అనవసరం!

కేశవ: ఏం? ఎందుకని?

అరుణ: నాకు తెలిసినంతవరకు ... ఇందిర వ్యక్తినీ ... అతని గుణగణాలనూ ప్రేమిస్తుంది. కానీ ... మీ ఆలోచన వేరు, మీరు డబ్బుకు ప్రాధాన్యత యిస్తున్నారు.

కేశవ: అవును. దానికి ప్రాధాన్యత లేదా?

అరుణ: దానికి ఉండే ప్రాధాన్యత దానికి ఉంది! పెండ్లికి ప్రేమ ప్రధానం.

కేశవ: ఈ కబుర్లన్నీ అనవసరం! అసలువిషయం చెప్తున్నాను! నీ ఊతంలేనిది...ఈ సమస్య యింతదూరం రాదు...ఇప్పటికైనా విరమించడం మంచిది; మీ క్షేమం కోరి చెబుతున్నాను!

అరుణ : మీకు అంత యిష్టం లేనప్పుడు, ఆ విషయం ఇందిరకు చెప్పండి !

కేశవ : నీవు చెప్పితే వింటుందని !

అరుణ : నేనుగాదు. ఎవరుచెప్పినా ఇలాంటి విషయాలు వినదు ! అది వాళ్ళ జీవితానికి సంబంధించిన విషయం ! వస్తాను. (వెళ్ళింది).

కేశవ : (తల పంకిస్తూ) చూస్తాను !

[సుబ్బన్న కాఫీతెచ్చి, కేశవరావుకు యిచ్చాడు. అతను కాఫీ తాగి, గ్లాసు కిందపెట్టాడు. మాధవరావు వచ్చాడు.]

మాధవ : (వస్తూనే) కేశవరావ్ !

కేశవ : ఓ...నీవా ?...రావోయి; రా; కూర్చో !

మాధవ : ఏంకూర్చో ?...ఇరవై నాలుగు గంటలూ కూర్చోవడమేనా ? సరదాగా అలా బయటకు వెళదాం రా... చల్లగాలికి !

కేశవ : వెళదాంలే; కూర్చో. (ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు).

మాధవ : ఏమిటి కేశవరావ్ !... ఆలోచిస్తున్నావ్ ?

కేశవ : ఏం లేదు ...

మాధవ : లేకపోవడం ఏమిటి ! భూషయ్యగారి వ్యవహారంలో నేను ఆవిధంగా చెప్పానంటే ...

కేశవ : నేను చాలా సంతోషించాను. నీ నిజాయితీ తెలుసుకోవాలనేగానీ... లేకపోతే ఆ బంజరుభూమి నాకెందుకూ?

మాధవ : ఆఁ ... ఏదోలే ...

కేశవ : నీతో ఒక ప్రధానమైన విషయం...

మాధవ : ఏమిటది ? చెప్పు ...

కేశవ : అదే ఆలోచిస్తున్నాను. చెప్పడమా ... చెప్పక పోవడమా — అని !

మాధవ : నాతో చెప్పడానికేమిటీ ? చెప్పవోయ్ !

కేశవ : (ఇంతముఖం చేసుకుని) ఏం చెప్పనూ ...

మాధవ : అంత రహస్యమూ ! చెప్పు; చెప్పు. పరవా లేదు లే!

కేశవ : నీ దగ్గర ఉన్న జబ్బు యిదే! పట్టుకుంటే విడిచి పెట్టవు ! చెప్పుదామా అంటే నోరు రావడం లేదు.

మాధవ : అయితే చెప్పకు !

కేశవ : చెప్పకపోతే మిత్రద్రోహి నవుతాను ! చెప్పానా... కొంప లంటుకుంటాయి. నా బాధ నీకేం తెలుస్తుంది.

మాధవ : ఏమిటి కేశవరావ్ నీవనేది ? నాకేమీ బోధపడడం లేదు !

కేశవ : అంత సులభంగా బోధపడేది కాదు లే ! ఇలా వస్తుందని కలలోకూడా అనుకోని విషయం ! నాకీ సంగతి తెలిసినప్పుడు ఎంత బాధపడ్డాననీ ?

మాధవ : అసలు విషయం చెప్పకుండా ఏమిటిదంతా ?

కేశవ : ఎందుగ్గానీ ఆ గొడవంతా యిప్పుడు ! నేనొక్క మాట చెప్పుతాను; విను. ఏదో ఒక పిల్లనుచూచి, వెంటనే శేఖర్ పెళ్ళి చేద్దాం !

మాధవ : ఏం ? ఇప్పుడంత అవసరం ఏం వచ్చిందీ ?

కేశవ : అదే అడగొద్దంటూన్నాను. శేఖర్ ప్రవర్తనను గురించి, ఊళ్లో ఎంత ఘోరంగా చెప్పుకుంటున్నారో తెలుసా ? వింటుంటే ... అబ్బ ! నా తల తీసేసినట్లుంది !

మాధవ : కొంపదీసి ... ఇందిర నేదైనా...

కేశవ : ఇందిర విషయమైతే యింత బాధపడాల్సిన పనే ముంది ? ఇద్దరూ పెళ్ళికానివాళ్ళు. ... అసలు నీకొంపకే నిప్పంటుకుంది !

మాధవ : ఆఁ ! !

కేశవ : అరుణకూ, శేఖర్‌కూ ఏదో సంబంధం ఉందని చెప్పు కుంటున్నారు !

మాధవ : ఆఁ !!!

కేశవ : అరుణగుణం మనకు తెలుసు ! శేఖరను చూద్దామా వాడూ అట్లాంటివాడుకాదు. అయితే ఏం ? ఎక్కడ జూచినా, ఇదేగోల !

మాధవ : అబ్బ ! (బాధగా) నీవుకూడా నమ్ముతున్నావా ?

కేశవ : ఛ ఛా ! ఒకళ్ళిద్దరు నాతో అంటే...గట్టిగా మంద లించాను. ఎందరినని మందలిస్తాం ? పిల్లిద్దరూ అంత అన్యోన్యంగా ఉండడంతో - యింత గొడవ వచ్చింది. దీనికి విరుగుడు - శేఖర్ పెండ్లి తొందరగా చెయ్యడం ! మరొక మార్గంలేదు...

మాధవ : శేఖర్ యింత ద్రోహం చేస్తాడా ? !...అరుణ... అరుణ...

కేశవ : నిజమే; నమ్మటానికి వీలులేకుండా ఉంది ! అందుకే కాలేజీకివెళ్ళి, శేఖర్ ప్రవర్తనను గురించి ఎంక్వైరీ చేశానుకూడా !

మాధవ : (బరువుగా) ఊఁ...చేస్తే...?

కేశవ: ఏదో...మనిషికి ఒక రకంగా చెప్పారు! మొత్తం మీద అక్కడ శేఖర్ స్నేహితులందరూ వచ్చేరాడీలని తేలింది!

మాధవ: (బాధగా) వాడికోసం నా సర్వస్వం ధారపోశాను. ఇంత ౼ని చేస్తాడా...!!

కేశవ: ఏ పుట్టలో ఏపాముందో? ముందు వాణ్ణి హాస్టల్లో పారెయ్యడం మంచిది. ఇట్లాంటి సమయంలోనే జాగ్రత్తగా ఆలోచించి, ఒక నిర్ణయానికి రావాలి! పద; అలా బయటికి వెళదాం!

[మాధవరావును లేవదీసి, బయటికి తీసుకువెళ్లాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. సుబ్బన్న వచ్చాడు. టేబులుదగ్గరకు వెళ్ళి, కుర్చీలూ వగైరా సర్దుతున్నాడు. ఇంతలో శేఖర్ వచ్చాడు. అతని చేతిలో "వీరేశలింగం జీవిత చరిత్ర" ఉంది.]

శేఖర్: (వస్తూనే) ఇందిర ఏం చేస్తూ ఉంది తాతా?

సుబ్బన్న: లేదు బాబూ.

శేఖర్: ఎక్కడకు వెళ్ళింది? సంక్షేమ పాఠశాలకా?

సుబ్బన్న: కాదు; రత్తయ్యగారి యింటికి పేరంటానికి వెళ్ళింది.

శేఖర్: అదా సంగతి? సరే; రాగానే ఈ పుస్తకం ఇందిరకు యివ్వు.

[పుస్తకం సుబ్బన్నకు యిచ్చాడు.]

సుబ్బన్న: (పుస్తకం తీసుకుంటూ) అట్లాగే బాబూ!

[ఇంతలో ఇందిర వచ్చింది]

ఇందిర: వస్తూనే ఏమిటది?

శేఖర్: వీరేశలింగంగారి జీవిత చరిత్ర.

ఇందిర : ఓహో ! (తాత దగ్గరనుండి పుస్తకం తీసుకుని చూచి, మళ్ళీ తాతకు యిచ్చింది) నా గదిలో పెట్టు తాతా !

[ సుబ్బన్న వెళ్ళాడు ]

శేఖర్ : ఏవిఁటి ఇందిరా అట్లా వున్నావ్ ?

ఇందిర : ఏం లేదు.

శేఖర్ : మరి యీ మౌనం ?

ఇందిర : మాట్లాడుతూనే ఉన్నానుగా !

శేఖర్ : నోరు మాట్లాడుతూ ఉంది. హృదయం బాధ పడుతూ ఉంది !

ఇందిర : అనుకుంటున్నావ్ ...

శేఖర్ : నేను అనుకోవడం కాదు. ఆ ముఖం చెపుతోంది ! హృదయానికి, ముఖం అద్దంలాంటిది !

[ ఇందిర పైటకొంగుతో - ముఖాన్ని కప్పి, పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంది. ]

శేఖర్ : ఇందిరా ! ఏవిఁటి? ఎందు కిట్లా బాధపడుతున్నావ్? మీ అన్నయ్య కోప్పడ్డాడా ? (ఆలోచించి) మన గ్రామ సంక్షేమ పాఠశాలకు వెళ్ళవద్దని ఉంటాడు ?

ఇందిర : (కన్నీటితో) నన్ను... నన్ను ... మరచిపో శేఖర్ !

[ఆవురుమంది]

శేఖర్ : ఊరుకో ఇందిరా ! మీ అన్నయ్య మన వివాహానికి అంగీకరించ లేదనేగా ? సహజమే. ఇందులో పెద్ద విశేష మేముంది ?

ఇందిర : ఏవిఁటి నీవు అనేది ?

శేఖర్ : అవును. నాలాంటి పేదవాడికి నిన్ను యివ్వడానికి, మీ అన్నయ్య అంగీకరించడు ! అందులో తప్పేముంది ? నిజానికి...నన్ను వివాహమాడి, నీవుమాత్రం సుఖపడేది ఏముంది ? కనుక...

ఇందిర : ఊఁ... కనుక... ?...

శేఖర్ : నీవు నన్ను చేసుకుంటానని పట్టుపడతావ్ ! దాని మీద నిన్ను మీ అన్నయ్య నానాహింసలూ పెడతాడు. నాకోసం...నీవు యిన్ని బాధలెందుకు పడాలి ? కనుక... ఆయనమాట విను !

ఇందిర : విని... తరువాత ఏం చెయ్యమంటావ్ ?

శేఖర్ : ఆయన యిష్టప్రకారం పెళ్ళి చేసుకోమంటాను.

ఇందిర : (నిట్టూర్చి) అది ఈ జన్మలో జరిగే పనిగాదు !

శేఖర్ : కనీసం ... నీవైనా సుఖపడతావు !

ఇందిర : (ఖచ్చితంగా) చాల్లే...

శేఖర్ : అదికాదు యిందిరా ! మీ అన్నయ్య...

[కేశవరావువస్తూ పై మాటలు విన్నాడు. ఇందిర కేశవరావును చూచి, లోనికి వెళ్ళిం ]

కేశవ : (వస్తూనే) ఊఁ...మీ అన్నయ్య ?

శేఖర్ : ఎక్కడకు వెళ్ళారని అడుగుతున్నా.

కేశవ : అంతావిన్నాను. నీవు మా ఇందిరను ప్రేమిస్తున్నావా ?

శేఖర్ : ఆమె కూడా నన్ను ప్రేమిం...

కేశవ : ప్రేమ ! అదంతా ఇందిరకేం తెలుసు ?! చిన్నపిల్ల ! నాలుగు మాయమాటలు చెప్పి తేసరి !

శేఖర్ : అది నా స్వభావంకాదు.

కేశవ : కాకపోతే ఇంటిలో ప్రవేశించి, ఒంటరిగా ఉన్న ఆడపిల్లతో ఎందుకు మాట్లాడతావ్ ? బి. ఏ. చదువుతున్నావ్; ఎక్కడ ఎట్లా ప్రవర్తించాలో కూడా తెలియదు!

శేఖర్ : అవును ! (వ్యంగ్యంగా) ఇక మిమ్ములను చూచి నేర్చుకుంటాను.

కేశవ : ఇది మొదలు నీవు యిక్కడకు రావడం మంచిది కాదు!

శేఖర్ : నేనూ అదే నిర్ణయానికి వచ్చాను.

[వెళ్ళాడు.]

కేశవ : (వెళుతున్న శేఖర్ వైపు ఒక క్షణంచూచి, కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ, లోనికిచూచి) ఇందిరా ! ఇందిరా ! !

[ఇందిరవచ్చి తలవంచుకుని నిలబడింది]

కేశవ : ఇంతకుముందు నేను నీకు చెప్పింది ఏమిటి ? నీవు యిప్పుడు చేసిందేవిఁటి ? నా మాట - అంటే ... అంత విలువ లేకుండా ఉందా ? బాగుపడదలచుకుంటే...ఇప్పటికైనా నీ అభిప్రాయం మార్చుకో !

ఇందిర : నేను అతన్ని ప్రేమించాను !

కేశవ : ఛీ ! ప్రేమించిందట; ప్రేమించడం ! సిగ్గులేకపోతే సరి ! తిప్పితిప్పి అమ్మితే గుడ్డిగవ్వ ఖరీదు చెయ్యడు ! వాణ్ణి పెళ్ళిచేసుకుని ఏమయి పోదామని ? రేపటినుంచీ వాడూ...నీవూ ముష్టికి బయలుదేరితే ... చూడలేక నేను చావాలి !

ఇందిర : ప్రపంచంలో పేదవాళ్ళు ఎందరు బతకడంలేదు ?

కేశవ : ఆ వెధవ బ్రతుకు బ్రతకాల్సిన గతి ఏంపట్టింది ? ఆ మాత్రం చదువుకున్న వాడూ ... అందగాడూ దొరక

డనా ? నీకెందుకు అదంతా! అన్ని విషయాల్లో వాడి తలతన్నిన వాణ్ణి తీసుకు వస్తాను; నేను జెప్పినట్లు విను !

ఇందిర : నాకు అతణ్ణే చేసుకోవాలని ఉంది !

కేశవ : ఏమిటీ ? ... ఇదుగో ఇందిరా ! చచ్చి పిడికెడు దుమ్మైతినా ... నిన్ను వాడి కివ్వను. అవసరమైతే గొంతు నులిమి అవతల పారవేస్తాను ...

ఇందిర : ఆపని చెయ్యి. అందరి చిక్కూ తీరిపోతుంది !

కేశవ : (మండిపడి) ఇందిరా !

ఇందిర : హాయిగా చచ్చిపోతాను !

కేశవ : (బిగ్గరగా) నోరుముయ్ ! (చేయి ఎత్తి ఇందిరను కొట్టబోయాడు. "బాబూ" - అంటూ సుబ్బన్న అడ్డం వచ్చాడు. కేశవరావు సుబ్బన్న చెంపమీద ఛెళ్ళున కొట్టాడు.)

ఇందిర : అన్నయ్యా !

సుబ్బన్న : కొట్టావా బాబూ ?

కేశవ : కొట్టడంకాదు. నిన్ను నిలువునా పగలగోసినా పాపం లేదు; ఎందుకురా నీవు యింట్లో వుండేది ? నీకు తెలియకుండానే ఈ నాటకమంతా జరుగుతూఉందా ? పో బయటకు — నా యింట్లోనుంచి !

సుబ్బన్న : పోతాను బాబూ ; పోతాను ! (వెళుతున్నాడు)

ఇందిర : తాతా !

సుబ్బన్న : నిన్ను మా యిద్దరి చేతుల్లోను పెట్టి, మీ అమ్మగారు చచ్చిపోయింది ! నాటినుంచీ నేటిదాకా పువ్వుల్లో పెట్టి పెంచాను. ఇన్నాళ్ళనుంచీ ఈ యింటో ఉంది

ఈయన్ని చూసికాదు; నిన్ను చూసి! ఈ తాత ఎక్క-
డున్నా నిన్ను మరిచిపోడు. వెళతానమ్మా.

[ వె ళు తు న్నా డు ]

ఇందిర: తాతా! తాతా! (ముందుకురావాలని ప్రయత్నించింది)

కేశవ: చావు! అవతలకు పో? (ఇందిరను మెడపెట్టి నెట్టాడు)

ఇందిర: (క్రింద పడింది) తాతా!

సుబ్బన్న: అమ్మా! (వెనుకకు తిరిగాడు)

కేశవ: అడుగు ముందుకు వేశావంటే చస్తావ్! పో బయటకు!!

[సుబ్బన్న అట్లాగే నిలబడిపోయాడు]

[ తెర ]

# అయిదో రంగము

[కామయ్యగారి యిల్లు: అలంకరణ లోగడ మాదిరిగానే ఉంటుంది. తెరలేచింది. మాధవరావు ఇంట్లోనుంచివచ్చి, అక్కడ కుర్చీమీద ఉన్న మడతవిప్పని ఉత్తరీయం భుజానవేసుకొని బయటకు వెళుతున్నాడు. అతనివెనుక కామయ్య వచ్చాడు]

కామయ్య: ఒరే అబ్బాయ్!

మాధవ: (నిలచి తండ్రివైపు చూచాడు)

కామయ్య: ఎక్కడికిరా?

మాధవ: ఏదో పనిమీద వెళుతున్నాను.

కామయ్య: తమ్ముడికి దెబ్బతగిలితే...అదేమీ పట్టించుకోకుండా యిక నీదారిని నీవు పోవడమే నన్నమాట!

మాధవ: భూమయ్యన్న వాణ్ణి డాక్టరుదగ్గరకు తీసుకువెళ్ళాడు.

కామయ్య: అదే; నువ్వు ఉండగా...ఎవరో భూమయ్య తీసుకుపోవాల్సినగతి ఎందుకు పట్టిందిరా వాడికి?

మాధవ: వాడు రౌడీలతో కాళ్ళూ...చేతులూ విరగగొట్టించుకుంటే...నేను కట్లు కట్టించుతూ కూర్చుంటాను!

కామయ్య : మొదటినుంచీ తమ్ముడంటే, ప్రాణం విడచే వాడివి ! ఇప్పుడు వాడి పేరుతలిస్తే నేమండిపడుతున్నావు; ఎందుకు యిట్టామారిపోయావో తెలియడం లేదు. వాడు ఏదైనా తప్పుచేస్తే దండించు ! అంతేగానీ...

మాధవ : తప్పుజేసింది వాడుగాదు; నేను !

కామయ్య : ఎందుకట్టా కుమిలిపోతావ్ ? ఉన్న సంగతేదో చెప్పకుండా ! ఇంట్లోతిని, హాయిగా బస్తీకెళ్ళి చదువుకునే తమ్ముణ్ణి, హాస్టల్లో ఉండి చదువుకోమని - అక్కడికి తరిమి వేశావ్ ! ఇప్పుడిట్టా మాట్లాడు తున్నావ్ ! ఏమిటిరా యిదంతా ? నాతోకూడా చెప్పగూడదా ?

మాధవ : ఏముందీ చెప్పడానికి ?

కామయ్య : ఏమీ లేనిది, నీలో యింతమార్పు ఎందుకు వస్తుంది ? అదేవిఁటో నువ్వు చెప్పవు. నీ భార్యను అడిగితే... "నాకు మాత్రం ఏం తెలుసు మావఁయ్యా" - అంటుంది ! ఎట్టాగురా చచ్చేది ?

మాధవ : అరుణ అంత సులభంగా బయట పడుతుందనే అడిగావా నాన్నా ? హుఁ ! నా చావేదో నేనే చస్తాను. మధ్యను మీకెందుకు వచ్చిన బాధ ? వెంటనే శేఖర్ పెళ్ళిచేసి, వాణ్ణి అవతలికి పంపించాలి. అందాకా ఈ పీడ విరగడకాదు ! (వెళ్ళాడు)

కామయ్య : అదా సంగతి ! (కుర్చీలో కూర్చుని క్షణం ఆలోచించాడు. లోనికి చూస్తూ) అమ్మాయ్ ! అరుణా!

అరుణ : (వచ్చి) ఏవిఁటి మావఁయ్యా ?

కామయ్య: ఆఁ... వేరే ఏమీ లేదు. ఉన్న దేదో చెరి కాస్త తీసుకుని, ఎవరితిప్పలు వాళ్ళు పడండిరా - అంటే బాగుంటుం దనుకుంటున్నాను.

అరుణ: ఎవర్ని? ఏవిటి...

కామయ్య: ఒకరి గొడవ మన కెందుకు? మన విషయమే!

అరుణ: అదేవిటి మావయ్యా! ఇప్పుడు అలాంటి అవసరం ఏం వచ్చిందీ?

కామయ్య: ఇవ్వాళగాకపోతే రేపు! తప్పదుగా? ఏకలతలూ రాకముందే జాగ్రత్తపడితే బాగుంటుందని...

అరుణ: శేఖర్ పెండ్లి కానివ్వండి. అంత అవసరమైతే ఆలోచిద్దాం!

కామయ్య: ఇదివరకు వాడి చదువుకే బోలెడంత డబ్బు అయ్యింది. మళ్ళీ వాడి పెళ్ళిఖర్చుకూడా మీమీద పడడ మెందుకు?

అరుణ: అలాంటి దుర్బుద్ధి నాకూ లేదు; వారికీ లేదు.

కామయ్య: ఎవరికి ఉందో... ఎవరికి లేదో... అంతా తేలి పోయింది.

అరుణ: ఏవిటది?

కామయ్య: ఏదో...అదంతా ఎందుకిప్పుడు? చూసినన్నాళ్ళు మమ్మల్ని బాగానే చూశావు. పోయిన పొడుగునా. ఈ పీడ నీకెందుకు? రేపటినుంచీ... నేనూ, శేఖరూ వేరే ఉంటాం! మీ భార్యాభర్తలు సుఖంగా ఉండండి!

అరుణ: మీ రేమైనా చెప్పండి! అలా జరగడానికి వీల్లేదు.

కామయ్య: ఎందుకమ్మాయ్ ఈ నటనంతా? వేరుపడమని, లోపలలోపల వాణ్ణి కసినికోత కోస్తున్నావు! దానితో వాడు కుమిలి కృశించిపోతున్నాడు. దేనికీ యింతగొడవ! వేరే ఉంటామంటే ఎవరు కాదన్నారు: అదేమైనాసరే! రేపు కుండ బద్దలుకొట్టి తీరాల్సిందే! (చరచరా బయటకు వెళ్ళాడు.)

[అరుణ నిర్ఘాంతపోయి, కామయ్య వెళ్ళినవైపు చూస్తూ...కొంచం సేపు నిలుచుంది. తర్వాత లోనికి వెళ్ళి, చీపురుతెచ్చి హాలు ఊడుస్తూ ఉంది. రత్తయ్య హడావుడిగా వచ్చాడు.]

అరుణ: రా బాబాయి! కూర్చో. (చీపురు అవతలవేసింది)

రత్తయ్య: (కూర్చుంటూ) ఉండాడా యింట్లో?

అరుణ: లేరే!

రత్తయ్య: ముసలాయన?

అరుణ: ఇప్పుడే బయటికి వెళ్ళారు.

రత్తయ్య: ఉండి మాత్రం ఆయనేంచేస్తాడు...ఈ కొడుకుని పెట్టుకుని? ఏదో చదువుకున్నాడు. కుటుంబం మంచిది... తెలివిగలాడు ... నాలుగురాళ్లు సంపాదించి, పెళ్ళానికి కూడు పెట్టుకోలేడా అనుకున్నాగానీ...ఇంత చేతగాని వాడనుకోలా! అందరం కలిసి, అన్యాయంగా నీ గొంతు కోశాం!

అరుణ: (సంకోచంపుగా) బాబాయ్! విషయం చెప్పకుండా ఏవిటీ మాటలు? వారేంచేశారు?

రత్తయ్య: (లేచి, ఉత్తరీయం ఈ చంకలోనుంచి ఆ చంకలోనికి మారుస్తూ) ఇంకా ఏం చెయ్యాలి? తనస్థితి ఏంటి? కేశవరావు

స్థితి ఏంటి? అదేవీఁ తెలుసుకోనక్కర్లా? ఇక...ఎటు
పడితే అటేనా...గుడ్డెద్దు చేలోపడ్డట్టు! ఆ కేశవరావును
కాదని, ఈయన తీరుపు చెప్పేవాడా? దానికి నీ సపోటా?

అరుణ: ఏం? చెప్పకూడదా? ఆ తీర్పులో తప్పేముంది?

రత్తయ్య: అహహాహా! ఆ దేముడు మీ యిద్దర్నీ జత
కూర్చినందుకు చెప్పాలి! సరిపోయింది; తగ్గ తాళం—
గొయ్యమేళం! కేశవరావంటే ఎట్లాంటివాడో...ఏవిటో
తెలిసే మాట్లాడతన్నావా?

[కామయ్యవచ్చి, వీరి సంభాషణ విని ఆగిపోయాడు]

అరుణ: తెలుసు; తెలుసు! తేనెపూసిన కత్తి!

రత్తయ్య: ఏ కత్తో...యిప్పుడేం తెలుస్తుందిలే మీకు!
ఆ ఉన్న రెండెకరాలూ, ఊడగొట్టినాగ్గానీ తెలిసిరాదు!

అరుణ: ఆయన, ముందు ఎప్పుడో ఏవిటో చేస్తాడని, ఇప్పుడే
దాసోహం – అనమంటావా?

రత్తయ్య: ఎవడికోసం! మీకంటే కొమ్ములు తిరిగిన
మొనగాళ్ళే అన్నారు! అనక ఇప్పుడేం చేస్తారో చెయ్యండి.
నోటు కంప్లైంటు చెయ్యబోతన్నాడు!

(కామయ్య ఉలిక్కిపడ్డాడు.)

అరుణ: (నిర్లక్ష్యంగా) అంతేగదా...

రత్తయ్య: (ఆశ్చర్యంగా) ఆఁ! కంప్లైంటంటే ఏం టను
కున్నావ్! రేపు కొంపలోనుంచి బయటికి ఈడుస్తారు!
బోలీ...బొచ్చె బజారులో పారేసి యాలాం వేస్తారు!

అరుణ: ఇందులో ఆశ్చర్యం ఏముంది? ఉండీ లేని కుటుం
బాలు వాళ్ళకు ఎప్పుడో ఒకనాడు ఈగతి తప్పదు.

రత్తయ్య: ఒకళ్ళకి కాకపోతే ఒకరికైనా తలకాయుంటే ఏదైనా చెప్పొచ్చు. అంతా అంతే! కుప్పకు నిప్పెట్టి పేలాలు వేంచుకుతినే మచ్చు! ఇంకేం?...కొంపా... గోడీ వదిలిపెట్టి, అడుక్కుతింటూ పొండి! ఎవడికేం పట్టిందీ?

అరుణ: ఎవరూ పట్టించుకోనక్కర లేదు. ఏం జెయ్యాలో... ఎట్లా సర్దుకోవాలో మాకు తెలుసు!

రత్తయ్య: సర్దుకోటానికి పదీ పరకా కాదు; వేలు! ఎక్కడ తెచ్చి తీరుస్తావ్?

అరుణ: (నిశ్చలంగా) నా నగలమ్మి తీరుస్తాను.

రత్తయ్య: (నవ్వి) ఇట్లాంటి తెలివితక్కువ దానివి గనకనే, వాళ్ళ యిష్టం వచ్చినట్టు ఆటాడతన్నారు.

అరుణ: అదేవిటి బాబాయ్?

రత్తయ్య: ఆ నగలమ్మి తీరిస్తే మాత్రం?...ఆ ఆస్తి మీకు దక్కుతుందా?

అరుణ: దక్కక ఎక్కడికి పోతుంది?

రత్తయ్య: ఎటుదటే పోతంది - దాని దారినది! ఉండ దాంటో సగం తమ్ముడి భాగమంటాను. వాడి పెళ్ళికనీ... పేరంటానికనీ... బాబు మనవర్తికనీ...అదనీ...ఇదనీ... మిగతా సగం ఊడగొడతారు. చివరికి అందునా, ఇందునా గాకుండా పోయేది నువ్వా...నీ మొగుడూ...

అరుణ: మీ మాట లేవిటో నాకు అర్థం కావటంలేదు బాబాయి. ఇంతకూ, ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్?

రత్తయ్య : అట్లా దారికిరా; చెబుతా! నగలూ అమ్మొద్దు; ఏమీ అమ్మొద్దు! నీ కెందుకూ? నువ్వు మెదలకుండా కూచో; ఆ కతంతా నేను నడుపుతా! రేపు ఏలాం వచినప్పుడు; కేశవరావు కాళ్లా వేళ్లా పడి, నా పేర కొట్ట యించుకుంటా! తరవాత నువ్వు నగలమ్మి డబ్బు కట్టా వనుకో? వస్తువులు పోయినా ఈ యిల్లూ ... పొలమూ నీకు దక్కుతయ్!

అరుణ : అట్లాగా? ... ఇది నీ అభిప్రాయమా? ... కేశవ రావుగారి ప్లానా?

రత్తయ్య : ఏదైతే నీ కెందుకూ? నేను చెప్పినట్టు చెయ్యి!

అరుణ : చాల్లే బాబాయ్! అంతట ఊరుకో. పెద్దవాడివి; ఇంత వయసు వచ్చింది; నీవు నాకు చెప్పవలసింది యిదేనా? నా భర్తకీ, మామగారికీ ... మరదికీ ... ఇంత గౌరవం ఉంటేనే - నాకూ ఉంటుంది! అది కాస్తా పోయిన తరువాత బతికేం? చచ్చేం?

రత్తయ్య : ఇదిగో అమ్మాయి! నీ మేలుగోరి చెబుతున్నా! నా మాట వింటావా — విను! లేకపోతే యిక నీ గడప తొక్కను.

అరుణ : ఇట్లాంటి సలహాలివ్వటానికి మాత్రం, మరెప్పుడూ రాకండి!

రత్తయ్య : (చిందులు తొక్కుతూ) ఆఁ...ఏమన్నావ్?! సరే; పోయి ఆ కిష్టలో కలవండి.

[రత్తయ్య రివ్వున బయలుదేరాడు. కామయ్య ఎదురయ్యాడు. ఆయన్ని తప్పుకుని, రత్తయ్య వెళ్ళిపోయాడు. అరుణ లోనికి వెళుతూ ఉంది]

కామయ్య : అమ్మా...

అరుణ : (వెను దిరిగి) ఏవిఁటి మావయ్యా ?

కామయ్య : మీ అత్తయ్యని నువ్వెరగవుగానీ......చాల నిదానస్తురాలు. ఆమె గుణగణాలను ఊరంతా మెచ్చుకునేవారు. జీవితంలో నా మాటకు ఎప్పుడూ...ఎన్నడూ ఎదురు చెప్పి ఎరుగదు.

అరుణ : నాకు అత్తయ్యను చూచే అదృష్టం లేకపోయింది. ఇప్పటికీ పెద్దవాళ్ళు ఆమెను గురించి చెపుతూనే ఉంటారు మావయ్యా !

కామయ్య : ఒకప్పుడు నాకూ నగలమ్మి అప్పు తీర్చవలసిన మర్గతి పట్టింది. ఆనాడు తన కుటుంబం కోసం...బిడ్డల కోసం ...... నగలివ్వటానికి అట్టాంటి మీ అత్తయ్యే తటపటాయించింది. కానీ... (గొంతు వణికింది) కానీ ... ఇవ్వాళ నువ్వు...నీ గుణం తెలుసుకోలేక అప్పుడప్పుడు కటువుగా మాట్లాడి, నీ మనసు నొప్పించానమ్మా !

[ఆనందమో...ఆవేశమో...కామయ్య కళ్ళవెంట కన్నీటి బిందువులు లటలట రాలాయి.]

అరుణ : (గాద్గదికంగా) మావయ్యా...!

కామయ్య : ఏం లేదమ్మా...(కళ్ళు తుడుచుకున్నాడు)

[భూషయ్యా, శేఖర్ ప్రవేశించారు. శేఖర్ హాఫ్‌హ్యాట్ ధరించాడు. కుడిచేతి మోచేతికి కట్టుకట్టి ఉంది.]

భూషయ్య: (కామయ్యవైపు ఎగా...దిగా చూచి) ఏంటిచిన్నయ్యా?

అరుణ : ఏం లేదు. అత్తయ్యమాటేదో వచ్చి...

భూషయ్య : అట్టాగా ?

అరుణ: శేఖర్! డాక్టరు ఏవంన్నాడు?

శేఖర్: ఫ్రాక్చర్ కాదన్నాడు వదినా?

భూషయ్య: బొయిక చిట్లిందేమో అనుకున్నాం గానీ... అదేం లేదంట్లే. మందురాసి ఆ గుడ్డ చుట్టాడు. కాపు వెయ్యమన్నాడు.

అరుణ: సరే, వేస్తాను. రా శేఖర్ (ఇద్దరూ లోనికి వెళ్ళారు)

కామయ్య: ఆ రౌడీ ముండాకొడుకుల జోలికి వెళ్ళటం ఎందుకూ?...ఈ దెబ్బలు తినటం ఎందుకూ!

భూషయ్య: అబ్బో! దానెనక శానాకతుంది.

కామయ్య: ఏవింటోయ్ అదీ?

భూషయ్య: నిన్న మన పిల్లలు నాటకం వేశారుగా?

కామయ్య: అవును; వేశారు.

భూషయ్య: ఆ నాటకం చెడగొట్టమని కేశవరావు రౌడీలను పంపాడూ...

కామయ్య: కేశవరావా! చాల్లే; నాటకం జెడగొడితే వాడికేం ఒరుగుతుంది?

భూషయ్య: ఏవీ లేదు! ఆ బుద్ధంట్లాంటిది. అన్న రౌడీలతో మాట్లాడటం చెల్లెలు చూచి, చల్లగా మాకు కబురు చేసింది! మేమూ తగు జాగర్త తీసుకున్నాం. వాళ్ళాట లేవి సాగలా! నాటకం అయిపోయిన తరవాత, మేమంతా యిళ్ళకు వచ్చేశాం. మనవాడు అక్కడ సామాన్లూ... అవీ సర్దుకుని, వెనకమాల వస్తున్నాడు. కడుపుబ్బు పట్ట లేక, ఎవడో సన్నాసి చాటుగా ఒక దెబ్బిసిరి, పారి పోయాడు!

కామయ్య: అట్లాంటప్పుడు నీడు ఒంటరిగా రావటం ఎందుకు? ఆ దెబ్బ ఏ తలకో తగిలితే....?

భూషయ్య: ఇం కేమన్నా ఉందా? అసలు వాణ్ణొదిలిపెట్టి మేం ముందురావటం తప్పయింది!

కామయ్య: కేశవరావుకూడా నాటకం చూట్టానికి వచ్చాడన్నారుగా!

భూషయ్య: రావటమేనా! ఊరి ఉమ్మడిసొమ్ము వాడిదగ్గిర ఉందిగా – మూడు వేలు! అదంతా బడికట్టించుకో టానికి యిచ్చెయ్యమన్నారు – మనవాళ్లు నలుగురూ. తప్పకుండా యిస్తానని పెద్ద ఉపన్యాసంకూడా దంచాడు. దేనికదే!

కామయ్య: దొంగముండాకొడుకు!

భూషయ్య: సరేగాని...చిన్నయ్యా! శేఖర్ కి దెబ్బతగిలిందని చెబితే, చీమకుట్టినట్టన్నా లేదేంటి మనాడికి! ఇది వరకు తమ్ముడంటే ఉండే ప్రేమంతా ఏమైందో మరి!

కామయ్య: దానికేం? ఇప్పుడుమాత్రం ఆ ప్రేమ లేదంటావా?

భూషయ్య: ఆ మాటట్టా అంటాంలే! ఈ నెల్లో తమ్ముడి పెళ్లి చెయ్యాలంట! ఇరవైనాలుగు గంటలూ అదే గొడవ?

కామయ్య: వాడికి చిన్నప్పట్నుంచీ ఉన్న అలవాటేగా? ఏదైనా చెయ్యదల్చుకుంటే అంతే!

భూషయ్య: అదీ నిజమేలే! వెళ్తా. (నాలుగడుగులు వేశాడు) ఇదిగో చిన్నయ్యా! (మళ్లీ వెనక్కి తిరిగి వచ్చాడు) మర్చిపోయానే; మా గిత్తదూడ పొద్దుట్నుంచీ మేత తినటంలా!

కామయ్య : ఏం ?

భూషయ్య : ఏమో... చెవులు ఏలగి లేసి, మునగదీసుకుని ఉంది. కాస్తి చూద్దువుగానీ, రా చిన్నయ్యా!

కామయ్య : సరే పద ! (వెళ్లారు)

(శేఖర్ వచ్చి టేబిలుమీద కూర్చున్నాడు. ఎడమచేత్తో పుస్తకం తెరిచి చదువుతున్నాడు. సుబ్బన్న వచ్చాడు.]

సుబ్బన్న : ఏం బాబూ ! చెయ్యి బాగా నెప్పిగా ఉందా ?

శేఖర్ : పెద్దగా ఏం లేదు. సంగతులేవిటో తాతా ?

[బత్తాయికాయ వొలుస్తూ అరుణకూడా వచ్చింది]

సుబ్బన్న : ఆ యిల్లు ఒదిలిపెట్టినాక మళ్ళీ యియ్యాల కన పడింది. నా తల్లి !

శేఖర్ : ఎవరూ ? ఇందిరేనా ?

సుబ్బన్న : అవును బాబూ !

అరుణ : ఏం తాతా...యిద్దరిలో ఎవరు బాగా చిక్కి- పోయారు ?

సుబ్బన్న : ఎన్ని చెప్పినా మొగాడు మొగాడే ! అమ్మాయి మరీ చిక్కి-పోయింది. నేనే గుర్తుపట్టలేకపోయా !

అరుణ : ఉపవాసాలు చేస్తే ఏమౌతుంది మరి !

సుబ్బన్న : నువ్వు ధైర్యం చెప్పబట్టి గానీ ... లేకపోతే యిన్నాళ్లు బతికేదా ?

అరుణ : పెళ్ళి ఎల్లుండే కాబోలు !

సుబ్బన్న : బొమ్మలు పెట్టిన లగ్గం అయితే - అదే ! దేవుడు పెట్టిన లగ్గం ఎప్పుడో మరి !

అరుణ : అన్నీ సవ్యంగానే జరుగుతాయిగానీ...నీవు వెళ్ళి నీ ప్రయత్నంలో ఉండు తాతా !

సుబ్బన్న : అట్టాగేనమ్మా ! అది పూర్తయ్యేదాకా నిద రేంటి !...ఆకలేంటి ! !

శేఖర్ : వెళ్లు తాతా ! తతిమ్మా విషయాలు నేను చూసుకుంటాను.

సుబ్బన్న : సరే బాబూ ! బల్ జాగ్రత్తగా ఉండాలి సుమా !

శేఖర్ : మరేం భయంలేదు. (సుబ్బన్న వెళ్ళాడు)

అరుణ : (బత్తాయి తొక్కలు టేబుల్ మీద పెట్టింది).

శేఖర్ : టైమయింది వదినా ! తొందరగా వెళ్ళాలి !

అరుణ : ఇంత ముఖ్యమైన పని పెట్టుకుని, రాత్రి నీవు మీటింగుకు రావడం పొరపాటు శేఖర్ !

శేఖర్ : వాళ్ళు మీటింగు చెడగొట్టడానికి ప్లాను వేశారని తెలిసీ, ఎట్లా రాకుండా ఉండను ?

[అరుణ బత్తాయితొన అందించింది. శేఖర్ కుడిచేత్తో ఆ తొన అందుకొని తినబోయాడు. చేతికి నొప్పి కలిగింది.]

శేఖర్ : అబ్బ...

అరుణ : ఓ...(తొన నోటికి అందించింది).

శేఖర్ : (సిగ్గుపడి) ఉండొదినా...(అరుణ నవ్వింది).

[శేఖర్, వదిన చేతిలో తొన ఎడమచేతితో అందుకుని తింటున్నాడు. మాధవరావు వచ్చి ఈ దృశ్యం చూచాడు.]

అరుణ : (టేబిలుమీది బత్తాయి తొక్కలు తీస్తూ - భక్తతో) ఈ కుంటి అబ్బాయికి పిల్లనెవరిస్తారూ ? !

శేఖర్ : ఇవ్వకపోతే మరీ హాయి ! ఇట్లాగే ఉంటాను.

[అరుణ నవ్వుతూ లోనికి వెళ్లింది]

మాధవ: హాస్టల్లో ఉండమంటే, అసలు నీవు యిక్కడి కెందుకు వచ్చావురా?!

శేఖర్: మీటింగు కోసం!

మాధవ: నీవు రాకపోతే మీటింగు జరగదా!... ఇంత మాత్రం మీటింగు లెప్పుడూ చూడలేదా? లేక... నా కేమీ తెలియదనుకున్నావా!! నీ వేషాలన్నీ తెలుసు! నిన్నేం చేసినా పాపంలేదు. నీవేదో ఉద్ధరిస్తావనుకున్నాను; ఇంత నీచుడవనుకోలేదు! పొద్దున్నే లేచి, నీ ముఖం చూచినా దరిద్రం! రాస్కెల్! పో – నా కళ్ళ ఎదుట నుంచి!!

అరుణ: (ప్రవేశించి) ఏమిటండీ అది?!

మాధవ: నోర్ముయ్!!

[అప్పటివరకూ గుమ్మంపక్కనించి చూస్తూన్న శేఖర్, తెప్పున బయ బయటకి వెళ్ళిపోయాడు.]

అరుణ: ఎందుకండీ అబ్బాయినట్లా తిడతారు? ఏంచేశాడు?

మాధవ: అది లోకానికీ నాకూ తెలియక పోవచ్చు! నీకు తెలియదా?

అరుణ: నాకూ ఏం తెలియదు! తెలిస్తే మీకు చెప్పకుండా ఉంటానా? ఇంతకూ శేఖర్ చేసిన తప్పేమిటి?

మాధవ: ఛీ; ఆ నీచుడి పేరెత్తకు? నాకు వాడు తమ్ముడూ గాదు; నేను వాడికి అన్ననూ గాదు! వాణ్ణి ముక్కలు ముక్కలుగా తరిగినా కసితీరదు! వాడు ఈ యింట్లో క్షణం ఉండడానికి వీల్లేదు!

అరుణ : ఏమిటండీ ఆ మాటలు ?

మాధవ : నీ సంగనాచి కబుర్లు కట్టిపెట్టు. పో - అవతలికి ! నీవు ఎంతో గుణవంతురాల వనుకున్నాను. ఇట్లా పతిత మాతానని కలలోకూడా అనుకోలేదు. అంత యిష్టం లేకపోతే...పోయి వాడితోనే ఊరేగు. పో !

అరుణ : (నిర్ఘాంతపోయింది) ఆఁ ! ఏమన్నారు ?

మాధవ : సిగ్గూ బిడియం లేకుండా మరిదితో ఊరేగే పతిత వన్నాను !

అరుణ : (కన్నీటితో) మీరేనా ఈ మాటలనేది ! శేఖర్ నన్ను తల్లిలా చూచుకుంటున్నాడు ! నే నతన్ని బిడ్డలా చూచు కుంటున్నాను. ఘోరమైన ఈ నిందవేయడం న్యాయం కాదు ! నేను ఏ పాపమూ ఎరుగనండీ ! (వచ్చి మాధవ రావు పాదాలు పట్టుకుంటుంది) మీ పాదాలసాక్షిగా చెబు తున్నాను !

మాధవ : ఛీ ! నీచురాలా ! (తన్నాడు. ఆమె వెళ్ళి దూరంగా పడింది) నా కళ్ళుకప్పి ఎన్నాళ్ళిట్లా నాటక మాడుదా మనుకొన్నారు ? మీ యికయికలూ...పకపకలూ...

అరుణ : (కుమిలిపోతూ లేచి) మీరు ఎందుకింత నీచంగా మాట్లాడుతున్నారో నాకు తెలుసు ! ఇది మీ పుట్టుకతో పుట్టిన బుద్ధి కాదు ! కేశవరావు మీలో విషాన్ని నింపాడు ! అది పూర్తిగా మీ తలకెక్కింది !

మాధవ : (బిగ్గరగా) అరుణా !

అరుణ : (తన ధోరణిలో) నేను మీ భార్యను ! నిజంగా మీరు నన్ను అనుమానించితే, ఇదికాదు శిక్ష ! ఒక్కసారిగా

చంపి వేయండి. మిమ్మల్ని అడిగేవారుండరు. మళ్ళీ మీకు మరో భార్య దొరుకుతుంది !

మాధవ : ఛో, అవతలకి !

అరుణ : కాని, శేఖర్‌ని పోగొట్టుకోకండి ! మళ్ళీ అలాంటి తమ్ముడు దొరకడు.

మాధవ : నోర్మూయ్ ! (ఫెళ్ళున చెంపమీద కొట్టి, రివ్వున బయటికి వెళ్ళిపోయాడు. అరుణ నిర్జీవ ప్రతిమలా నిలచి, భర్త వెళ్ళినవైపు చూస్తోంది. కన్నీరు ధారకట్టి ప్రవహించుతూంది. శేఖర్ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు).

అరుణ : (శేఖర్ ముఖాన్ని తేరిపార జూచి, కుర్చీమీద నుంచి లేచింది) మీ అన్నయ్య సంగతి నీకు తెలియదా శేఖర్, వారేదో అన్నారని......

శేఖర్ : ఆయన నన్నెప్పుడూ ఒక్కమాట అనలేదు. కాని, ఇవ్వాళ అనవసరంగా ... (గొంతు పెగలక ఆగిపోయాడు)

అరుణ : నిజమే; వారేదో అన్నారని నీ విట్లా...

శేఖర్ : (అరుణ చెంపమీద తేలిన వ్రేళ్ళను చూచి నివ్వెరబోయి) అదేమిటి వదినా !

అరుణ : (చెంప సవరించుకుంటూ) ఏం లేదు.

శేఖర్ : (గద్గద కంఠంతో) నా గురించి నీవు దెబ్బలు కూడా పడ్డావా వదినా !

అరుణ : అబ్బే, లేదు బాబూ !

శేఖర్ : (కటకట పడుతూ) నీ మీద చెయి చేసుకున్నాడంటే, నిజంగా ఆయన మనిషే... ?

అరుణ: (బిగ్గరగా) శేఖర్!

శేఖర్: వదినా!! (ఆమె కాళ్ళు పెనవేసుకున్నాడు)

అరుణ: (శేఖర్‌ను లేవనెత్తి) ఇదంతా ఆ కేశవరావుగారి కుట్ర! ఆయన నీ మీద ఏవో చాడీలు చెప్పిఉంటాడు. ఆ కుట్రను భగ్నంచేయాలంటే ధైర్యం వహించి...

శేఖర్: వాణ్ణి ముక్కలు ముక్కలుగా నరకాలి!

అరుణ: అప్పుడు నీవు నిర్దోషివౌతావా? ఈ గొడవలోపడి, నీ కర్తవ్యమేదో మర్చిపోయావు. వెళ్ళినవాడవు మళ్ళీ తిరిగి వచ్చావెందుకు?

శేఖర్: నా కర్తవ్యం మరచిపోయి కాదు వదినా! నీ ఆశీర్వాదంకోసం.

అరుణ: వెళ్ళిరా నాయనా! నీవు పూనుకున్న పని జయప్రదమౌతుంది.

[శేఖర్ వెళ్ళిపోయాడు. అరుణ దీర్ఘాలోచనలో పడింది. వచ్చి కుర్చీమీద కూర్చుంది].

[తెర]

# ఆరో రంగం

రామయ్యగారి ఇల్లు

[అలంకరణ లోగడ మాదిరిగానే ఉంటుంది. తెరలేచింది.]

సుబ్బన్న : (ప్రవేశించి ముఖానికి చేయి అడ్డం పెట్టుకొని లోనికి చూస్తూ) అమ్మా, అరుణమ్మా! (అటూ ఇటూ పచారు చేస్తున్నాడు.)

అరుణ : (ప్రవేశించి) ఏం, తాతా, ఏమైంది ?

సుబ్బన్న : అనుకున్న పని అనుకున్నట్టు జరిగిందమ్మా!

అరుణ : ఇబ్బందు లేమీ కలుగ లేదుకదా ?

సుబ్బన్న : (నవ్వి) ఎత్తువేస్తే మళ్ళీ దానికి తిరుగుందా ! నరమానవుడి కంటబడకుండా కార్యక్రమం సాగించాను. ఆ కొంపలో ఏం జరిగిందో యింతమట్టుకు పసికట్టినవాడే లేడు.

అరుణ : మరి, భూషయ్యగారు, శంకరయ్యగారు !

సుబ్బన్న : మళ్ళీ యిన్నిసార్లా! ఆ యిద్దర్నీకూడా అదే కారులో పంపేశాను.

అరుణ : మంచిపని జేశావు తాతా ! సరే వీ రెక్కడ?

సుబ్బన్న : ఎవరు ? మాధవబాబా, మా కేశవయ్యగారి యింటిదగ్గర పెత్తనమంతా ఆయనదేగా ! సరేగాని

అమ్మా! వెళ్ళేటప్పుడు ఈయన శేఖర్ బాబు కేమీ డబ్బు యివ్వలేదేంటీ ?

అరుణ : ఇవ్వలే దనుకుంటాను.

సుబ్బన్న : అందుకే కావాలు "మా వదిన ఏమైనా డబ్బిచ్చిందా తాతా !" అని అడిగాడు, ఇద్దామంటే నా దగ్గర కానీ లేకుండా పోయింది.

అరుణ: అయ్యో! నా వద్దకూడా ఏం లేదు తాతా! (ఆలోచించి) సరే, వుండు. లోపల మామగారున్నారు అడిగివస్తాను. (లోనికి వెళ్లింది; సుబ్బన్న అటూ యిటూ తిరుగుతున్నాడు. అరుణ తన చేతిగాజులు తీస్తూ ప్రవేశించింది).

అరుణ : తాతా ! వెంటనే యీ గాజులు తీసికెళ్లి శేఖర్ కు యివ్వు. ఎక్కడైనా పెట్టి డబ్బు తెచ్చుకుంటాడు.

సుబ్బన్న : ఆఁ ! గాజులా ?

అరుణ : ఫరవాలేదు. ఎంత అవసరమో ఏమో ! తొందరగా వెళ్ళు తాతా !

సుబ్బన్న: అట్టాగేనమ్మా (సుబ్బన్న బైటకు, అరుణ లోనికి వెళ్లుతూ వుంటారు. బయటనుంచి వస్తున్న మాధవరావును సుబ్బన్న చూస్తాడు. వెంటనే తాను పరీక్షగా చూస్తున్న గాజులను వెనుకకు దాచి ఒక ప్రక్కకు తొలుగుతాడు.)

మాధవ : (ప్రవేశించుతూ) ఏవిఁటవి సుబ్బన్నా?

సుబ్బన్న : ఏంలేదు బాబూ.

మాధవ : అస లెందుకొచ్చావ్ యిక్కడికి?

సుబ్బన్న : అమ్మాయితో కొద్దిగా పనుండి.

మాధవ: ఏవిఁటా పని?

సుబ్బన్న: అదేదో అయిపోయింది. వెళతన్నా బాబూ. (వెళ్ళుతుంటాడు.)

మాధవ: ఆగు, ఏవిఁటా చేతులోవి. తే, ఇలు తే. (అంటూ వెళ్ళి సుబ్బన్న చేతులోని గాజులు లాక్కుంటాడు.) గాజులు! నీ కివి ఎట్లా వచ్చినై?

సుబ్బన్న: అవసరమై అడిగితే డబ్బులేక యివి యిచ్చింది, అష్టం పెట్టుకోమని. (అరుణ వచ్చి వింటూవుంటుంది.)

మాధవ: ఎంత అవసరమైతే మాత్రం నీకు గాజులిస్తుందా! నిజం చెప్పు.

సుబ్బన్న: దొంగిలించానంటారా?

అరుణ: తాతా! నీ కెందుకు నీవు వెళ్ళు (మాధవ వైపు తిరిగి) నేనే యిచ్చానండీ. (సుబ్బన్న వెళ్ళిపోతాడు.)

మాధవ: ఇచ్చావా! యివ్వటానికి నీ వెవరవు. నీ కేం హక్కుంది. ఎవ డిచ్చాడు నీ కీ అధికారం?

కామయ్య: (ప్రవేశించి) ఏవిఁట్రా?

మాధవ: (గాజులు చూపెడ్తూ) ఏముంది కోడలు చేసిన ఘన కార్యం. ఇవిగో.

కామయ్య: అంతేగదా! నువ్వు చేసే అప్పులు చేస్తున్నావ్. అవసరాలుమాత్రం ఎక్కడివక్కడే వుంటునై. ఈ నెలలో తమ్ముడికి యింతవరకు డబ్బు పంపావా?

మాధవ: పంపకపోతే?

కామయ్య: ఏముంది......

అరుణ: మావయ్యా!

కామయ్య: ఉండమ్మా, నీకు తెలియదు. (మాధవరావుతో) పరీక్షలముందు నా దక్కడ డబ్బులేక నానా అవస్థలు పడుతుంటే నీలాగా కళ్ళప్పగించి చూస్తూ వూరుకోలేక ఈ గాజులిచ్చి పంపుతూంది, అదీ తప్పేనా!

మాధవ: ఆఁ!

అరుణ: (కంగారుగా మాధవరావుతో) అది గాదండి.

మాధవ: ఛీ! నోరు ముయ్, నీచురాలా! ఇదివరకు విన్న విషయాలు నమ్మీ నమ్మలేకుండా వున్నాను. ఇప్పుడు స్పష్టంగా తేలిపోయింది. వాడికీ, నీకూ మధ్య యీ ముసలి నక్క సుబ్బన్న గాడన్నమాట. నిన్ను నరికేసినా పాపం లేదు. (అరుణమీదకు వెళతాడు.)

కామయ్య: (అడ్డం వచ్చి) ఏమిట్రాఁ అది: ఏం కూతలురా!

మాధవ: నీ చిన్నకొడుకు, కోడలు చేసే చేష్టలు యింకా అర్థం కాలేదా నాన్నా?

కామయ్య: నోరుముయ్, పశువా. (చేయెత్తుతాడు)

మాధవ: చాలండి! మీకు, నాకు ఏ విధమైన సంబంధం లేదు. (వెళ్ళిపోయాడు. అరుణ ఏడుస్తూ వుంటుంది.)

కామయ్య: ఊరుకో అమ్మా! ఊరుకో.

అరుణ: (ఏడుస్తూ) నాకు తల్లయినా, తండ్రైనా మీరే మావయ్యా.

కామయ్య: (అరుణను ఓదారుస్తూ) నా బొందిలో ప్రాణముండగా నీమీద ఈగ వాలనీయనమ్మా. వాడి రోగం నేను కుదుర్చుతాను. (బైటకు వెళ్ళుతూ వుంటాడు)

అరుణ : మావయ్యా! పెద్దవారు; అనుభవం కలవారు. ఏదో ఒక విధంగా వారిని దారికి తీసుకురావాలి గాని, మీరూ తొందరపడితే ఎట్లా మావయ్యా!

కామయ్య : ఈ మధ్య వీడిట్లా ఉండడానికి యిదా కారణం! అసలు వీడికి యీ దుర్బుద్ధి ఎందుకు పుట్టిందో?

అరుణ : ఆ కేశవరావుగారి మహిమ. వారిని నమ్మించాడు.

కామయ్య : ఆ వెధవ చెప్పితే వీడు నమ్ముతాడా! వీడి తెలివి తగలెయ్య. ఆ కేశవరావుగాడి బ్రతుకు, బండారం ఎవడికి తెలియదు? చూస్తాను! (గబగబా బయటకు వెళ్లిపోతూ వుంటాడు.)

అరుణ : మావయ్యా! మావయ్యా!

కామయ్య : భయపడకమ్మా! యిప్పుడే వస్తాను.

అరుణ : మావయ్యా! మావయ్యా! (అని పిలుస్తూనే వుంటుంది. ఆయన వెళ్ళిపోతాడు. ఆమె ఏమీ తోచక కాలుకాలిన పిల్లిలా అటూ యిటూ కొంతసేపు తిరిగి లోనికి వెళ్ళుతూ వుంటుంది.)

కేశవ : (వచ్చి) అరుణా! (అరుణ ఆగింది) రేపే ఇందిర వివాహం!

అరుణ : విన్నాను.

కేశవ : పెళ్లి ప్రయత్నాలన్నీ పూర్తిచేశాను. బంధువులంతా వచ్చారు. తెల్లవారేసరికి పెళ్ళివారుకూడా దిగుతారు.

సంతోషం.

...కా సంతోషం?

అరుణ : అంటే ?

కేశవ : ఇందిర కనుపించడం లేదు.

అరుణ : ఏమైంది ?

కేశవ : ఏమౌతుంది ? ఉంటే మా యింట్లో ఉండాలి; లేదా మీ యింటికి రావాలి.

అరుణ : మా యింటికి రా లేదు. కనుక మీ యింటి దగ్గరే ఉంటుంది.

కేశవ : అదంతా కాదు. ఇందిరను ఎక్కడ దాచావో చెప్పు.

అరుణ : ఒకరిని దాయాల్సిన అవసరం నాకేం లేదు.

కేశవ : మీ యింట్లో లేదంటావ్ ?

అరుణ : లేదు.

కేశవ : లేకపోవచ్చు. కాని ఎక్కడికి వెళ్ళిందో నీకు తెలుసు. నీ ప్రోత్సాహం లేనిదే ఇందిర ఏపనీ చెయ్యలేదు. ఇదంతా నీ కుట్ర !

అరుణ : కుట్రలూ, కుతంత్రాలూ పన్ని, కుటుంబాల్లో కలతలు సృష్టించడం నాకు అలవాటు లేదు.

కేశవ : ఆ సంగతి తెలిసే నీవు ఈ పనికి పూనుకున్నావన్న మాట ! ఇదివరకు సృష్టించిన కలతలు చాల చిన్నవి. ఇప్పుడు ఇందిరను నాకు నప్పగించవో, ఏం జరుగుతుందో తెలుసా !

అరుణ : (నవ్వి) తెలిసుంటే యింత మూర్ఖంగా ప్రవర్తిస్తాను ? వెళ్ళిరండి ! (లోనికి వెళుతూ

[కామయ్య, మాధవరావులు ప్రవేశించి, వెంగు వద్దన నిలబడతారు. కేశవరావు కర్ర అర్థమయిన కోలది మాధవరావు, కేశవరావుమీదకి దూకబోతాడు. కామయ్య మాధవరావుని చేసైగతో నొక్కిపట్టి వెనక్కి లాగుతూంటాడు.]

కేశవ : (గండిపడి) అరుణా! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? ఆడదానితో ఎందుకని ఇంతవరకూ నిర్లక్ష్యంగా ఊరుకున్నాను. అనవసరంగా రెచ్చగొట్టకు. తల్చుకుంటే నిన్నేమైనా చెయ్యగలను. జాగ్రత్త!

అరుణ : ఏం చేస్తావ్? చెయ్యగలిగిందేదో ఇదివరకే చేశావు. నా మీద దారుణమైన నింద వేశావ్! అంతకంటె యింకేం చేస్తావ్?

కేశవ : ఇదివరకు ఒట్టి నిందలతోనే పోయింది. ఇప్పుడు యిందిరను నాకు ఒప్పగించకపోతే ఏం జరుగుతుందో ఆలోచించుకో! నీ మాధవరావు నా చేతిలో కీలుబొమ్మ. వాడిచేత నిన్ను జుట్టుపట్టి, బటబట బజారుకు ఈడ్పిస్తాను! పదిమంది యెదుట చిత్రవధ చేయిస్తాను. నిన్నూ, నీ కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాను!

అరుణ : ఛీ, నీచుడా! కట్నం తక్కువలో పోతుందని, చెల్లెల్ని ఒక గుడ్డివాడికి అంటగట్టటానికి సిద్ధమయ్యావు! ఆ కట్నంకోసమే భార్యను పుట్టింటికి తరిమావు! నా భర్తను నాకు దూరంచెయ్యాలని తలచావు! ఆయన శాశ్వతంగా నీ చేతిలో కీలుబొమ్మగా ఉంటారని కలలు గంటున్నావు! నీలాంటి ద్విపాదపశువులకు ఈ ప్రపంచంలో స్థానం లేదు.

కేశవ: రాక్షసీ! ని న్నేంచేసినా పాపంలేదు. నా పరువు ప్రతిష్ఠలు ధ్వంసంచేశావు. నీ మొగుడు అసమర్థుడు కనుక ఏమీ చేయలేడని నీ ఉద్దేశ్యమేమో! వాడిదాకా ఎందుకు? ఆ పని నేనే పూర్తిచేస్తాను. (బొడ్లోనుంచి పేష్‌కబ్ తీసి, అరుణమీదకు వెళ్తూ) చెప్పు, ఇప్పుడు చెప్పు! ఇందిరను ఎక్కడ దాచావ్? ఏం చేశావ్? చెప్తావా చెప్పవా? చీల్చి పారేస్తాను. చెప్పు, ఇందిర ఎక్కడ? ఊఁ చెప్పు! (కత్తి ఎత్తాడు)

కామయ్య: ఏంట్రా చెప్పేది, గాడిదకొడకా! (అంటూ, ముదిపులిలా స్టేజిలోనికి దూకి, కేశవరావు చేతిలోని పేష్‌కబ్‌ను ఎగరగొడుతూ ఝాడించి అతని డొక్కలో తన్నాడు. కేశవరావు చిత్రబిళ్లలా ఎగిరి క్రింద పడ్డాడు. అతని చేతిలోని కత్తిపోయి దూరంగా పడింది. కామయ్య వాడిమీదపడి కాళ్లా చేతులా మర్దించుతున్నాడు.)

[మాధవరావు క్రింద పడివున్న కత్తిని అందుకుని, ఉన్మత్తుడులా కేశవరావుమీదకు వస్తున్నాడు.]

అరుణ: (ఆదుర్దాగా) ఏవండీ! (అంటూ భర్తకు అడ్డంవచ్చి, అతన్ని పట్టుకుంది. ఆ పెనగులాటలో మాధవరావు చేతిలోని కత్తి అరుణ ముంజేతికి తగిలి రక్తం చిందింది. మాధవరావు తెల్లపోయాడు. అరుణ "పరవాలేదు" అంటూ కత్తిలాగి దూరంగా పారవేసి, అతని చేతిని గట్టిగా పట్టుకుని, కామయ్యవైపు చూచింది. ఆయన కేశవరావు గొంతు నులిమివేస్తున్నాడు.)

అరుణ: (బిగ్గరగా) మావయ్యా! (ఆ కేకతో కామయ్య కేశవరావును విడిచి లేచాడు.)

కామయ్య : (ఆవేశంగా) ఏ యిల్లాలికి నీవు కీడు తలపెట్టావో, ఆ యిల్లాలే యిప్పుడు నిన్ను కాపాడిందిరా! లేక పోతే, ఇవ్వాళ నీ నెత్తురు తాగేవాణ్ణి. మళ్ళీ ఈ గడప తొక్కావా, నీ గుండెలు చీలుస్తాను. ఫో! (అంటూ తన్నాడు. ఆ తన్నుకు కేశవరావు సైడ్‌కర్టెన్ వద్ద పడి, దేకుతూ దేకుతూ జరిగి, బ్రతుకుజీవుడా అని లేచి పారిపోయాడు.)

మాధవ : (రొప్పుతూ) పరమ కిరాతకుడు! ద్రోహి! మిత్ర ద్రోహి! రాక్షసుడు! నీచుడు! ఎంత ద్రోహానికి పాల్పడ్డాడు? వీణ్ణి...

కామయ్య : (మాధవరావు దగ్గరకు వచ్చి, లాగి చెంపమీద కొట్టి) నీవు ఊరినీ దేశాన్నీ ఉద్ధరించేది, ఇట్లాంటి లుచ్ఛాలతో చేరేనంట్రా?

మాధవ: నేను చేసిన తప్పుకు ఈ శిక్ష చాలదు. (క్రింద పడి వున్న కత్తిని అందుకుని, కామయ్య కిస్తూ) దీనితో నన్ను చీల్చి వెయ్ నాన్నా!

కామయ్య : నిన్ను చీల్చినా, శిక్షించినా, క్షమించినా (అరుణను చూపుతూ) అదిగోరా, నీ భార్య!

మాధవ : (అరుణవైపు నడుస్తూ) అరుణా! నేను నిన్ను అనుమానించి, మహాపాపం చేశాను. నా పాపానికి పరిహారంలేదు.

[అరు]ణ : పోనివ్వండి, ఏదో అయిపోయింది. మిమ్మల్ని కేశవ రావు నమ్మించాడు. మీరు ఆయన కుట్రలోపడ్డారు. [పో]తే! ఇప్పటికైనా నిజం తెలుసుకుని బయటపడ్డారు. [అ]దివేలు!

కామయ్య: అమ్మా! ఈ గొడవంతా శేఖర్‌కు తెలిస్తే, ఇంకా వాడు బ్రతుకుతాడా? ముందు వాణ్ణి చూడాలి.

అరుణ: తొందరపడకండి, అంతా వస్తారు.

[ఇంతలో శేఖర్, ఇందిర, భూమయ్య, శంకరయ్య, మురళి వచ్చారు. ఇందిర, శేఖర్‌ల మెడలలో పూలదండ లున్నాయి. వాళ్ళిద్దరూ సరాసరి వచ్చి, కామయ్య పాదాలకు నమస్కరించారు. కామయ్య వాళ్ళను లేవనెత్తాడు.]

మాధవ: (చేతులు చాచి) తమ్ముడూ!

[శేఖర్ అన్నవైపు నడిచాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు. ఇందిర వెళ్ళి, అరుణకు నమస్కరించింది. ఆమె ఇందిరను దగ్గరకు తీసుకుని, తల నిమురుతూ ఉంది.]

శేఖర్: వదినా! (వెళ్ళి, ఆమెకు నమస్కరించాడు. అరుణ ఇందిరనూ, శేఖర్‌నూ చెరో చేతితో పట్టుకుని) సుఖంగా ఉండండి నాయనా!

కామయ్య: ఏమిటిదంతా?

భూమయ్య: ఇంకేంటి చిన్నయ్యా! కొడుకూ, కోడలూను! (అరుణను చూపి) అమ్మాయి ఉపాయం ఆలోచించింది. దాని ప్రకారం (మురళిని చూపిస్తూ) మన నూపరెండెంటుగారబ్బాయి కారు తెచ్చి, చింతలతోపు దగ్గర నిలబెట్టాడు. సమయానికి సుబ్బన్న తాత అమ్మాయి ఇంటోనుంచి తప్పించి, అక్కడికి తీసుకొచ్చాడు. అం... కలిసి బస్తీకి వెళ్ళి, అక్కడ పెళ్ళిచేశాం, రిజిష్టరు ... పెద్ద పెద్దోళ్లు కూడా సంతకాలు పెట్టారు, ... కున్నావో!

శేఖర్ : నిజంగా మురళి సహాయం లేకపోతే నేనీ కార్యం సాధించగలిగేవాణ్ణి కాదు నాన్నా !

మురళి : (నవ్వుతూ) హాస్టల్లో ప్రవేశించిన నెల రోజుల్నుంచీ నీవు పడుతున్న పాట్లు చూస్తూ, ఏ స్నేహితుడు ఉంటాడురా సహాయం చెయ్యకుండా ! (అంతా నవ్వారు)

కామయ్య : ఇంతకీ వా డేదైనా కేసుపెట్టడుగదా !

శంకర : ఏమో ! పెడితే పెట్టనూవచ్చు.

అరుణ : ఇందిరకు మైనారిటీ వెళ్ళింది. ఇప్పు డాయన చేయ గలిగింది ఏమీ లేదు.

భూషయ్య : అది కాదమ్మా, ఒక పని చెయ్యాలం టే, రాజకీయంగా, ఆర్థికంగా అ దేంటీ ? ఆఁ ! సాంఘికంగా ఎన్ని ఆలోచించాలి ! ! (అంతా నవ్వారు).

మాధవ : అవును భూషయ్యన్నా ! కబుర్లుచెప్పి దేశాన్ని ఉద్ధరించా లనుకున్నాను. నేను కోతలతో సాధించ లేని పనులు, అరుణ చేతలతో సాధించింది. స్త్రీలు ముందుకు రావాలంటే సమాజంలో ఎన్నెన్ని చిక్కు లున్నాయో యిప్పుడు అర్థమైంది ! నిజంగా అరుణ నాకు భార్యే కాదు; మార్గదర్శకురాలు కూడ !

అరుణ : నేను చేసింది ఏమైనా ఉంటే, అదంతా మీ రిచ్చిన స్వాతంత్ర్యం వల్ల నే !

మాధవ : దుర్మార్గుడు ! తన యింటిదగ్గర పెండ్లి పనులు నన్ను చూడమని, వాడు యిక్కడికి వచ్చాడు, నిన్ను

చంపడానికి. నాన్న నన్ను సమయానికి ఇక్కడికి తీసుకు రాకపోతే, ఈ కుట్ర బయటపడేదికాదు.

ఇందిర : అక్కయ్యను చంపటానికి వచ్చాడంటే, నిజంగా మా అన్నయ్య!

భూమయ్య : అది సరేగానీ, మావాడి పరీక్షలు దగ్గరకు వచ్చినై యంట! జాగ్రత్త మరదలా!

బాబు : (పరుగునవచ్చి) ఇకనైనా సరిగ్గా బళ్ళోకొచ్చి, మాకు పాటలు నేర్పుతావా అక్కా!

[మళ్ళీ అంతా నవ్వారు. రత్తయ్య గుండెలు మాటుకట్టుకుని లోనికి వచ్చారు.]

రత్తయ్య : కేశవరావు ఇంత పని చేస్తాడని కల్లోకూడా అనుకోలేదు కామయ్య బావా! తెలవక వాడు ఎగర మన్నట్లా ఎగిరాను. తరవాత నువ్వు ఏమన్నా చెయ్.

కామయ్య : ఇందులో నువ్వు చేసిన పెద్ద తప్పు ఏముందిలే! రా బావా! రా, రా!

[సుబ్బన్న లోనికి వచ్చాడు]

ఇందిర : తాతా! (సుబ్బన్న దగ్గరకు వెళ్ళింది)

సుబ్బన్న : (ఇందిర తల నిమురుతూ) నేటికి నా కోరిక ఈడేరింది!

ఇందిర : నీ ఋణం ఎట్లా తీర్చుకోం తాతా?

సుబ్బన్న : అదెంత పనమ్మా?

ఇందిర : చెప్పు తాతా! అంతకంటే యింకేంకావాలి మాకు?

సుబ్బన్న : మరేం లేదు, ఒక్క చిన్నపాట !

ఇందిర : హో తాతా !

[అంతా నవ్వారు. ఇందిర అరుణవద్దకు వెళ్ళింది.]

కామయ్య : (శేఖర్‌తో) అయితే, ఇద్దరూ కలిసి పాడండి !

అరుణ : (ఇందిర చేతిని శేఖర్ చేతికందించి) ఊఁ పాడండి !

(వధూవరులు "దేశమును ప్రేమించుమన్నా" ప్రారంభించారు. రెండవ చరణం పాడుతూ ఉండగా, తెర క్రిందికి వాలింది. తెర వెనుక అంతాకలసి పాడుతూ ఉన్నారు.)

సమాప్తం.



## సవరణ

45వ పేజీ 15వ పంక్తి 'పంచమ శ్రుతిలో ప్రణయ గాథలను' అనుటకు బదులు 'విసిగిపోయి తన విషాద గాథను' అని చదువు కోవాలి.

KOTHALARAAYUDU . 1.50

# సుంకర సత్యనారాయణగారి
# ఇతర రచనలు

| | | |
|---|---|---|
| భూమికోసం | (నాటకం) | రు. 1.25 |
| గిత్తలబేరం | (నాటికలు) | [illegible] |
| వీరకుంకుమ | ,, | [illegible] |
| ప్రతిఫలం | ,, | 1.00 |
| కష్టజీవి | (బుర్రకథ) | 0.19 |
| రుద్రమదేవి | ,, | 0.37 |
| వీరేశలింగం | ,, | 0.25 |
| అమరజీవి | ,, | 0.19 |

(పోస్టేజి అదనం)

ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం,
బకింగ్‌హాంపేట : : విజయవాడ.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL B 106 B 121 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |